


# సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 27వ మహాసభ

## 1986-1990 కాలానికీ, 2000వ సంవత్సర పర్యంతానికీ సోవియట్ యూనియన్ ఆర్థిక, సామాజికాభివృద్ధి మార్గదర్శక సూత్రాలపై సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 27వ మహాసభకు నివేదిక

సమర్పణ:

నికలాయ్ రిష్కోవ్
సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ పొలిట్‌బ్యూరో సభ్యుడు,
సోవియట్ యూనియన్ మంత్రిమండలి అధ్యక్షుడు

*1986 మార్చి 3*

సంపుటి 20 సోస మార్చి 7
సోవియట్ సమీక్ష
10 1986



రచన:—నికలాయ్ ఇవానవిచ్ రిష్కోవ్

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ పొలిట్‌బ్యూరోసభ్యుడు,

సోవియట్ యూనియన్ మంత్రిమండలి అధ్యక్షుడు

# విషయసూచిక





# 1986-1990 కాలానికీ, 2000వ సంవత్సర పర్యంతానికీ సోవియట్ యూనియన్ ఆర్థిక, సామాజికాభివృద్ధి మార్గదర్శక సూత్రాలపై సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 27వ మహాసభకు నివేదిక

సమర్పణ:

## నికలాయ్ రిష్కోవ్

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ పొలిట్‌బ్యూరో సభ్యుడు,
సోవియట్ యూనియన్ మంత్రిమండలి అధ్యక్షుడు

కామ్రేడ్ ప్రతినిధులారా,

గౌరవనీయులైన అతిథులారా,

లెనిన్ మహాశయుడు నిర్దేశించినబాటలో దాదాపు యేడుదశాబ్దాలుగా సోవియట్ కమ్యూనిస్టు పార్టీ దేశాన్ని ఆత్మవిశ్వాసంతో నడిపిస్తోంది. పార్టీ, ప్రజల వీరోచిత చరిత్రలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 27వ మహాసభకు ప్రత్యేకస్థానంవుంటుంది. కమ్యూనిస్టునిర్మాణంలో అపారప్రాధాన్యతగల ఒకదశలో మాతృభూమిప్రగతికి వ్యూహాన్ని నిర్వచించే, సోవియట్ సమాజజీవితంలోని అన్ని అంశాల మౌలికపునర్వ్యవస్థీకరణను ప్రారంభించేబాధ్యత దీనిపై వుంది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్రధానకార్యదర్శి మిహయిల్ గొర్బచేవ్ పార్టీ 27వ మహాసభకు సమర్పించిన సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ రాజకీయనివేదికలో పార్టీ, ప్రజల సృజనాత్మకకృషికి సంబంధించిన సవివర చిత్రణవుంది. మార్క్సిజం-లెనినిజం సుదృఢసూత్రాలదృక్కోణంనుండీ నిర్మాణాత్మకంగా యీ రాజకీయనివేదిక సత్వర సామాజిక-ఆర్థికాభివృద్ధిభావనను లోతైన ఆధారాలతో

నిరూపించింది; పార్టీ, దేశ, సామాజికజీవితానికి సంబంధించిన బహువిధసమస్యలన్నిటినీ కొత్తగా నిర్వచించింది. సోషలిజంస్థాయినిపెంచేవ్యూహాన్ని, యెత్తుగడలను, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ ప్రభుత్వ ఆంతరంగిక, విదేశాంగవిధానాలను యీ నివేదిక సరికొత్తగా నిర్వచించింది. ప్రగాఢమైన వర్గవిశ్లేషణప్రాతిపదికపై యిది ఆధునిక ప్రపంచంలోని శక్తులపొందికనూ, దాని అభివృద్ధిలోని ప్రధాన ధోరణులనూ, వైరుధ్యాలనూ తెలియజేస్తోంది: పెరుగుతూన్న ప్రపంచ సోషలిస్టువ్యవస్థ శక్తిస్తోమతలను వెల్లడిస్తోంది. యావత్తు మానవాళినీ వేధిస్తున్నసమస్యలపట్ల—యుద్ధమూ, శాంతి, అణ్వస్త్రయుద్ధప్రమాదాన్ని తప్పించడం అనే సమస్యలపట్ల—మన వైఖరిని యీ నివేదిక శక్తివంతంగా స్పష్టంచేసింది.

సైద్ధాంతిక విషయగంభీరతను, సృజనాత్మక ఆలోచనాధోరణిని, పేరుకుపోయిన లోపాలకు, చిక్కులకుగల కారణాలను అంచనావేయడంలో రాజీలేనివైఖరి, నూతన కర్తవ్యాలను రూపొందించడంలో వాస్తవికత, ధైర్యం—యివి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ రాజకీయనివేదికను అపారచరిత్రాత్మక ప్రాముఖ్యంగలపత్రంగా పరిగణించడానికిగల ఆధారాలు.

1985 ఏప్రిల్‌లో జరిగిన సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశం ప్రభావంవల్ల రూపుగొన్న నైతిక, రాజకీయవాతావరణం, పార్టీ అనుసరిస్తున్న పంథా సరైనదేనని యీ రాజకీయనివేదికలో తొణికిసలాడుతున్న దృఢవిశ్వాసం యీ మహాసభ కృషిసాగుతున్న యావత్తు వాతావరణాన్ని నిర్ణయించాయి. యీ మహాసభ కృషి వ్యవహారసరళిలో, నిర్మాణాత్మకంగా, ఖరాఖండివైఖరితో, సోవియట్ ప్రజలపట్ల పార్టీకిగల సమున్నతబాధ్యతనుగురించిన యెరుకతో సాగుతోంది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ రాజకీయనివేదికపై, పార్టీకార్యక్రమ కొత్తకూర్పుపై జరిగిన చర్చ పార్టీసభ్యులమధ్యగల యేకశిలాసదృశమైన ఐక్యతను, సోవియట్ కమ్యూనిస్టుల, వాస్తవానికి యావన్మంది సోవియట్ప్రజల భావైక్యతను, కార్యాచరణ యేకతను విశ్వసనీయంగా నిరూపిస్తోంది.

1986-1990 కాలానికీ, 2000 వ సంవత్సరపర్యంతానికీ సోవియట్ యూనియన్ ఆర్థిక, సామాజికఅభివృద్ధికి సంబంధించిన, పార్టీకేంద్రకమిటీ మహాసభ పరిశీలన నిమిత్తం సమర్పించిన మార్గదర్శకసూత్రాల ముసాయిదా ఒకముఖ్యమైన రాజకీయ, ఆర్థికపత్రం. గత ఏప్రిల్‌లో జరిగిన సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశం రూపొందించినట్టి వేగం పెంచడమనేభావన యీ ముసాయిదాకు ఆధారం. యీ ముసాయిదా ప్రస్తుత శతాబ్దాంతంవరకూగల కాలంలో సాధించాల్సిన కార్యక్రమ కర్తవ్యాలనూ, లక్ష్యాలనూ నిర్దిష్టంగా తెలుపుతోంది: వుత్పాదకశక్తులను గుణాత్మకంగా తిరిగి సర్దుబాటుచేయడానికీ, సమాజసాంఘికాభివృద్ధికీ ప్రధానమైనదిశలను నిర్వచిస్తోంది.

ముసాయిదా మార్గదర్శకసూత్రాలు సోవియట్ ప్రజల కీలకప్రయోజనాలకూ, భవిష్యత్తుపై వారి ఆశలకూ పూర్తి అనుగుణంగావున్నాయి. ముసాయిదాపై దేశవ్యాప్తంగా జరిగిన చర్చ అత్యంతస్పష్టంగా పై విషయాన్ని నిరూపించింది. యీ చర్చలో దాదాపు 110 మిలియన్లమంది పౌరులు పాల్గొన్నారు.

అంతేగాక, శ్రామికప్రజలకుగల గొప్పరాజకీయపరిణతినీ, మన సోషలిస్టు మాతృభూమి శక్తిస్తోమతలను పటుతరంచేయడంపట్ల మన సమాజంలోని అన్ని బృందాలకూగల ప్రగాఢమైన నిబద్ధతనూ యీ చర్చ యావత్తూ నిరూపించింది.

ఈ ముసాయిదా మార్గదర్శకసూత్రాలు విదేశాల్లో గణనీయమైన ఆసక్తిని రేకెత్తించాయి. అయితే, దీనిపట్లగలవైఖరిలో సహజంగానే తేడాలున్నాయి. రూపొందించిన ప్రణాళికల ప్రాముఖ్యతకూ, లక్ష్యాలకూ తప్పుడువ్యాఖ్యానాలు చేయడానికి మనవర్గవిరోధులూ, శత్రువులూ ప్రయత్నిస్తున్నారు. అయితే సహజంగానే వారు యీ ప్రణాళికలప్రమాణాన్నీ, వీటివెనుకగల ధైర్యసాహసాలనూ గుర్తించకతప్పడంలేదు. నూతనసామాజికవ్యవస్థ ఆధిక్యతలకూ, యీనాటి మౌలికసామాజిక-ఆర్థిక సమస్యలను పరిష్కరించడానికి యీ వ్యవస్థకుగల సామర్థ్యానికీ యీ పత్రం ఒకస్పష్టమైన సూచిక అని మనమిత్రుల, ముఖ్యంగా సోదరసోషలిస్టుదేశాల్లోగల మనమిత్రుల అభిప్రాయం. మన కుటుంబాన్ని పటిష్ఠంచేయడాన్ని, సోషలిజంస్థానాలను, అన్ని ప్రగతిశీలశక్తులస్థానాలను, ప్రపంచంలో శాంతిఆశయాన్ని సంఘటితంచేయడాన్ని వీరు దీనితో ముడిపెడుతున్నారు.

# I. 11వ పంచవర్ష ప్రణాళికాకాలంలో సోవియట్ యూనియన్ ఆర్థిక, సామాజికాభివృద్ధి: ఫలితాలు, నిర్ధారణలు

కామ్రేడ్స్,

లెనినిస్టు సంప్రదాయాలకు దృఢంగా కట్టుబడివుంటూవున్న కమ్యూనిస్టు పార్టీ ఆర్థికవ్యవస్థ స్థితిగతులను, భవిష్యత్తులో దాని అభివృద్ధికిగల స్తోమతలనుగురించిన వాస్తవికఅంచనాతో, అంతవరకూ సాధించిన ప్రగతిగురించిన వస్తుగతవిశ్లేషణతో దీర్ఘకాలానికి సంబంధించిన విశాలదృక్పథాన్ని యెప్పటిమాదిరిగానే మేళవిస్తోంది.

గత ఐదేళ్ళలో సాధించిన ప్రగతిని మార్గదర్శకసూత్రాల ముసాయిదా సమాహరిస్తోంది. దేశఆర్థిక శక్తిస్తోమతలపటిష్టతకు సోవియట్ ప్రజలు తమ కృషిద్వారా గణనీయమైనదోహదంచేశారనే నిర్ధారణకు రావడానికి యీ ప్రగతి పూర్తి ఆధారాలను

సమకూరుస్తోంది. ప్రజల సంక్షేమం పెరుగుదలకూ, మనదేశరక్షణ సామర్థ్యాన్ని తగినస్థాయిలో వుంచడానికి యిది ప్రాతిపదిక అయింది.

అయితే, 26 మహాసభ రూపొందించిన కర్తవ్యాలను నెరవేర్చడానికి జరిగినకృషి అంతసరళమైనస్థితిలో జరగలేదని, ముఖ్యంగా ప్రారంభదశలోపరిస్థితి యెంతోక్లిష్టంగా వుండిందనిచెప్పవచ్చు. యిది మీ అందరికీతెలుసు. 1970 లలో ఆర్థికాభివృద్ధిలో యెదురైన అననుకూలధోరణులు 1980 లలో తగ్గడానికిబదులు తీవ్రమయ్యాయి. 11వ పంచవర్ష ప్రణాళిక పరిపూర్తిపై యిది వ్యతిరేకప్రభావం నెరపింది. మొదటి రెండుసంవత్సరాల్లో పెరుగుదలరేట్లు తగ్గుముఖంపట్టడం కొనసాగింది. ఆర్థికమేనేజిమెంట్ నాణ్యతా సూచీలు క్షీణించాయి. 1982 లో పారిశ్రామికోత్పత్తి పెరుగుదలరేటు 10వ పంచవర్ష ప్రణాళికా కాలంలోని సగటురేటుకంటే 1.5 రెట్లు తక్కువగావుండింది. పెరుగుతున్న యీ చిక్కులప్రభావం సామాజికరంగంలో సైతం ముఖ్యసమస్యల పరిష్కారంపై పడకతప్పలేదు. వుదాహరణకు, ఆ పంచవర్షప్రణాళికాకాలంలోని రెండవ సంవత్సరంలో ప్రజల వాస్తవాదాయాల పెరుగుదల విజానికి విల్చిపోయింది.

అనేక కారణాలవల్ల యిలాజరిగింది. యీ లోపాలకుగల మూలకారణాలివి: ఆచరణాత్మకకృషిలో, ముఖ్యంగా విస్తృతాభివృద్ధికిగల శక్తిసోమతలు హరించుకపోవడం వల్లమారిన ఆర్థికపరిస్థితిని సకాలంలో పరిగణనలోకితీసుకోలేదు; శాస్త్ర, సాంకేతికప్రగతి సాధించిన విజయాలను వుపయోగించుకోడంలో యీనాటి ఆవశ్యకతలకు అనుగుణంగా ఆర్థికవ్యవస్థనూ, దానిమేనేజిమేంట్‌నూ పునర్వ్యవస్థీకరించడంలో తగిన పట్టుదలను చూపలేదు. దీనికితోడు, కేంద్రంలో, స్థానికప్రాంతాల్లో అనేకమందినాయకులు కాలంచెల్లిన పద్ధతులననుసరించి పనిచేయసాగారు; మాతనపరిస్థితుల్లో పనిచేయడానికి సిద్ధంకాలేదని నిరూపించుకున్నారు. క్రమవ్యవస్థ, క్రమశిక్షణ సహించరానిస్థాయికి దిగజారింది. నిష్కర్షమైఖరి, బాధ్యతాభావం—వీటిస్థాయిపడిపోయింది. ప్రణాళికలను తగ్గించి, దిద్దుబాట్లనుచేసే దురాచారం విస్తృతంగాప్రబలింది. సోషలిస్టు ఆర్థికవ్యవస్థకు ప్రణాళికను పరిపూర్తిచేయడం ఆర్థికజీవితంలో చట్టమూ, ప్రమాణమూ. కానీ, సోషలిస్టు ఆర్థికవ్యవస్థతాలూకు మార్చరానటువంటి ఆ సూత్రంనుండీ యీకాలంలో వైదొలగడం జరిగింది. యీ క్రమాలను సూత్రబద్ధ రాజకీయదృష్టితో అంచనావేయలేదు; యెలాంటి ఆచరణాత్మకనిర్ధారణలనూ చేయలేదు.

ఈ పరిస్థితిని విమర్శనాత్మకంగా విశ్లేషించినతర్వాత, ప్రధానంగా వ్యవస్థీకరణనూ, శ్రమసంబంధిమైన క్రమశిక్షణనూ పెంచడంద్వారా ఆర్థికాభివృద్ధిమేనేజిమెంటును పటుతరం చేయడానికి పార్టీ చర్యలనుతీసుకుంది. యీ చర్యలను యావత్తుప్రజానీకమూ బలపర్చింది; అవి మనప్రగతికి ఒక వూపునిచ్చాయి. తత్ఫలితంగా, 1980 మొదలుకొని స్పష్టమైన

సానుకూలమార్పులువచ్చాయి. 11వ పంచవర్షప్రణాళిక పరిపూర్తికానిలోపాన్ని యిది కొంచెం పూరించగలిగింది.

| | 1981_1985 లో మొత్తం (బిలియన్ రూబుళ్ళలో) | 1976_1980 లతో పోలిస్తే 1981_1985లో నిరపేక్ష పెరుగుదల (బిలియన్ రూబుళ్ళలో) | 1976_1980 లతో పోలిస్తే 1981_1985 లో మొత్తం పరిమాణం పెరుగుదల (శాతం) |
|---|---|---|---|
| జాతీయాదాయం వినిమయానికీ, సంచయనంచేయడానికీ వుపయోగించినభాగం | 2,398 | 353 | 117 |
| పారిశ్రామికోత్పత్తి | 3,778 | 628 | 120 |
| వ్యవసాయోత్పత్తి (1983 ధరవరల్లో) | 1,010 | 53 | 106 |
| అన్నిరకాల రవాణా సాధనాలద్వారా రవాణా చేసిన సరకు (ట్రిలియన్ టన్ను కిలోమీటర్లు) | 37.1 | 5.7 | 118 |
| స్థాపిత మౌలికఆస్తులు | 815 | 147 | 122 |
| పరిశ్రమలనిర్మాణంలోని మదుపులు | 842 | 125 | 117 |
| చిల్లరవ్యాపారం టర్నోవర్ | 1,466 | 226 | 118 |

ఈ పంచవర్షప్రణాళికాకాలంలో జాతీయాదాయం 17 శాతమూ, పారిశ్రామికోత్పత్తి 20 శాతమూ పెరిగాయి. పరిశ్రమల్లోకెల్లా గ్యాస్‌పరిశ్రమ వేగంగా అభివృద్ధిచెందింది. గ్యాస్ వుత్పత్తిపరిమాణం విషయంలో దేశం ప్రపంచంలో అగ్రస్థానాన్ని అందుకుంది. అణువిద్యుత్కేంద్రాల్లో వుత్పత్తయ్యే విద్యుచ్ఛక్తి రెండురెట్లకుమించింది. విడివిడిరకాల యంత్రసాధనాలవుత్పత్తి ప్రాధాన్యతారేట్లలో పెరిగింది. భవననిర్మాణ పరిశ్రమలోకూడా కొన్నిమార్పులు జరిగాయి. ఆహారకార్యక్రమాన్ని అమలుజరపడం కోసం కొన్నిప్రగాఢమైనచర్యలను తీసుకోడంజరిగింది; దీనివల్ల వ్యవసాయోత్పత్తి పరిమాణం పెరగడానికి వీలుకలిగింది. యీ పంచవర్ష ప్రణాళికాకాలంలోని ద్వితీయార్ధంలో

సామాజికోత్పత్తి సామర్థ్యసూచీలు మెరుగవుతూన్న సూచనలు కనిపించాయి.

ఎన్ని యిబ్బందులున్నప్పటికీ జీవనప్రమాణాలపెరుగుదల విషయంలో 26 వ మహాసభ నిర్దేశించిన లక్ష్యాలను సాధించడానికి పార్టీ గరిష్ఠకృషిచేసింది. ఫ్యాక్టరీ కార్మికుల, కార్యాలయోద్యోగుల నెలసరివేతనం, సమిష్టివ్యవసాయక్షేత్రరైతులుచేసిన పనికియిచ్చే ప్రతిఫలం పెరిగాయి; సామాజికవినిమయనిధులను పెంచడంజరిగింది.

| | 26వ మహాసభ ఆమోదించిన మార్గదర్శకసూత్రాల లక్ష్యాలు | వాస్తవానికి సాధించినది |
|---|---|---|
| 1980 తో పోలిస్తే 1985లో ఫ్యాక్టరీకార్మికుల, కార్యాలయోద్యోగుల సగటు నెలసరి వేతనాల పెరుగుదల, శాతంలెక్కన | 113—116 | 113 |
| 1980 తో పోలిస్తే 1985 లో సమిష్టి వ్యవసాయక్షేత్రాల రైతులకు సగటు నెలసరి చెల్లింపుల్లో పెరుగుదల, శాతంలెక్కన | 120—122 | 129 |
| 1980తో పోలిస్తే 1985లో సామాజికవినిమయ నిధుల పెరుగుదల, శాతంలెక్కన | 120 | 125 |
| 1981-1985 లో పూర్తిచేసిన గృహవసతి కల్పన, మిలియన్ చదరపు మీటర్లలో | 530—540 | 552 |
| 1981-1985లో పిల్లలకోసం పూర్తిచేసినపాఠశాలాపూర్వసదుపాయాలు, మిలియన్ల సీట్లలో | 2.5 | 2.9 |
| 1981-1985 లో విద్యార్థులకోసం పూర్తిచేసిన సార్వత్రిక విద్యాపాఠశాలల నిర్మాణం, మిలియన్ల సీట్లలో | 4.3 | 5.2 |
| 1980 తో పోలిస్తే1985 లో ఆస్పత్రి పడకల సంఖ్య పెరుగుదల, శాతంలెక్కన | 108—110 | 108.7 |
| 1981-1985 లో వున్నత విద్యాసంస్థలు, ప్రత్యేక సెకెండరీ పాఠశాలలు తర్ఫీదు చేసిన ప్రవీణులు, మిలియన్లలో | 10 | 10.5 |

పింఛన్లలో పెరుగుదల, ఆరోగ్యసంరక్షణావ్యవస్థలో మెరుగుదల, యెక్కువ మంది పిల్లలుగల కుటుంబాలకుయిచ్చే ప్రభుత్వసాయంలో గణనీయమైనపెంపుదల వుండినాయి. విద్యారంగానికీ, పాఠశాల సంస్కరణకూ గణనీయమైన నిధులను కేటాయించారు. గత పంచవర్ష ప్రణాళికలకాలాల్లో జరిగినట్టుగానే గృహనిర్మాణం పెద్ద యెత్తునసాగింది. 10 మిలియన్లకుపైగా యింటివాటాలను అద్దెకిచ్చారు. పార్టీ ఆదేశాల మేరకు గ్రామీణప్రాంతంలో సామాజికపునర్వ్యవస్థీకరణాక్రమం గ్రామీణుల, పట్టణవాసుల జీవనప్రమాణాలను ఒకేస్థాయికి పెంచేపని కొనసాగింది.

ఈ విధంగా యీ పంచవర్షప్రణాళికాకాలంలో యెంతోకృషిజరిగింది; అయితే, భవిష్యత్తుకు అవసరమైన నిర్ధారణలను రూపొందించడానికై దీని ఫలితాలను మనం వస్తుగతంగా అంచనావేయాలి; మన ప్రగతికి అడ్డుగావిల్చే తీవ్రమైనలోపాలను నిబద్ధమైన, పార్టీస్ఫూర్తితో వెలుగులోకి తీసుకురావాలి.

ఈ పంచవర్షప్రణాళిక నిర్దేశించినకర్తవ్యాలను పూర్తిగా సాధించలేదనేవిషయాన్ని దాపరికంలేకుండా ప్రకటించాల్సివుంది. అనేకపరిశ్రమలు ప్రణాళికాలక్ష్యాలను చేరుకోలేకపోయాయి. మొత్తంపై, యీ ఐదేళ్ళలో నిర్ణీతలక్ష్యానికన్నా ఆయావస్తువులవుత్పత్తి యిలాతగ్గింది—తయారైన ఉక్కుబద్దీలు, రేకులు 35 మిలియన్లటన్నులు, బొగ్గు 145 మిలియన్లటన్నులు; చమురు 50 మిలియన్లటన్నులకుపైగా; 16 బిలియన్ల రూబుళ్ళ విలువగల వినిమయదారీ సరకులు. యంత్రాలు, యంత్రపరికరాల రూపకల్పన, సాంకేతిక స్థాయి, నాణ్యం అన్నిసందర్భాల్లో జాతీయార్థికవ్యవస్థ అవసరాలకు అనుగుణంగా లేకపోయింది. రసాయన, కలప,కలపపని పరిశ్రమలు నిర్ణీతవుత్పత్తిలక్ష్యాలకు నిరంతరం వెనుకబడిపోసాగాయి. ప్రధానమైన సాధారణ నిర్మాణ మంత్రిత్వశాఖలు యేఏటికీ తమ ప్రణాళికలకు సరితూగలేకపోయాయి. వ్యవసాయంలోవినియోగించిన విస్తారవవరులనుండీ మనం ఆశించిన ప్రతిఫలం పొందలేదు. సామర్థ్యం విషయంలో నిర్ణయించినకర్తవ్యాలను యేఏటా పూర్తిచేయలేదు. శాస్త్ర, సాంకేతికప్రగతి మందగించింది.

ఇదంతా మొత్తం ఫలితాలనూ, అర్థికాభివృద్ధి సమతూకాన్నీ దెబ్బతీసింది. జాతీయాదాయంలో బిలియన్లరూబుళ్ళ నష్టానికి దారితీసింది. దీని పర్యవసానంగా వాస్తవాదాయాలు, చిల్లరవ్యాపార టర్నోవర్‌లాంటి జీవనప్రమాణాల పెరుగుదలకై నిర్దేశించిన అనేకకర్తవ్యాలు నెరవేరలేదు. ద్రవ్య, ద్రవ్యచలామణీ పరిస్థితిలో చిక్కులు యెదురయ్యాయి.

కాగ్రమేణ్వా, దీర్ఘకాలంగా పేరుకుపోతూవచ్చిన లోపాలవల్ల భారం యెంతగాపెరిగిపోయిందంటే, స్వల్పకాలంలో వీటిని తొలగించడం అసాధ్యమని రుజువైంది. విడివిడిగా తీసుకున్నచర్యలు ఆర్థికవ్యవస్థలో ప్రతికూలధోరణులను అరికట్టలేకపోయాయి; స్థిరమైన,

శక్తివంతమైన అభివృద్ధి ప్రధాన ఆర్థికవ్యవస్థను పురోగమింపజేయలేకపోయింది. మౌలికమైనమార్పులు, ఆమూలాగ్రంగా పునర్వ్యవస్థీకరణ అవసరమయ్యాయి. దేశానికి యెదురైన సమస్యలకు సమూలపరిష్కారాలకోసం పార్టీపట్టుదలతో అన్వేషించసాగింది. 1985 ఏప్రిల్‌లో జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశం కమ్యూనిస్టులకు, సోవియట్‌ప్రజలకు నిర్దేశించినలక్ష్యం సరిగ్గాయిలాంటి పునర్వ్యవస్థీకరణే. యీ సమావేశం మన సమాజజీవితంలో ఒకమలుపుతెచ్చింది. దేశతక్షణావసరాలను తీర్చగలదీ, సామాజిక-ఆర్థికాభివృద్ధిని త్వరితపర్చే పార్టీపంథాకు అనుగుణమైనదీ సరిగ్గా యీ పునర్వ్యవస్థీకరణే.

ఇందుకవసరమైనవన్నీ మన జాతీయార్థికవ్యవస్థకున్నాయి: శక్తివంతమైన వుత్పాదకరంగం, శాస్త్ర, సాంకేతిక మేధాస్తోమత, నిపుణసిబ్బంది, ప్రకృతివనరులు. యిప్పుడు ప్రధానమైన విషయమేమిటంటే, ప్రణాళికాబద్ధ సోషలిస్టు వ్యవస్థకుగల ఆధిక్యతలనూ, దినదినప్రవర్ధమాన అవకాశాలనూ వినియోగించుకోడం, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ఆర్థికవ్యూహాన్ని పట్టుదలతో అమలుజరపడం.

# II. దేశసామాజిక, ఆర్థికాభివృద్ధిని శీఘ్రతరంచేయడం—2000 వ సంవత్సర పర్యంతానికి వ్యూహాత్మక కర్తవ్యం

కామ్రేడ్స్,

2000 వ సంవత్సరంతో ముగిసేకాలానికి దేశసామాజిక-ఆర్థికాభివృద్ధిని త్వరితం చేసేందుకు, తద్వారా సోవియట్ సమాజాన్ని గుణాత్మకంగా నూతనస్థాయికి తీసుకు పోయేందుకు, దాని వుత్పాదకశక్తులను ప్రగాఢపరివర్తనచెందేట్టు చేసేందుకు, వుత్పత్తి సంబంధాలను మెరుగుపర్చేందుకు పార్టీ అనుసరించాల్సిన పంథా ముసాయిదా మార్గదర్శకసూత్రాల్లో నిర్దిష్టకర్తవ్యాలుగా, అంకెలుగా రూపుగొంది.

మొదటివిషయం, దేశం యెదుర్కొంటున్న కర్తవ్యాల పరిమాణం, క్లిష్టత పెరగడంవల్లా, యీ కర్తవ్యాల అమలుకు ఒకటి, రెండు పంచవర్షప్రణాళికాకాలాలకంటే యెక్కువ వ్యవధిఅవసరం కావడంవల్లా 15 యేళ్ళ కాలాన్ని యెంచుకోడం జరిగింది. అంతేకాదు, శాస్త్ర, సాంకేతిక విప్లవఅభివృద్ధికి సంబంధించిన భావిఅంచనాలను దృష్టిలో

పెట్టుకొని, దాని ప్రస్తుత దశలోని ఘనవిజయాలను పూర్తిగా వినియోగించుకోడానికి యిది అత్యుపయుక్తమైన వ్యవధి.

ప్రధానమైన సమస్యలను పరిష్కరించేందుకూ, ముఖ్యంగా 2000 వ సంవత్సరం వరకూ పరివ్యాప్తమైన, ప్రత్యేక ప్రయోజనంగల సమగ్రకార్యక్రమాలను అమలుజరిపేందుకూగల మార్గాల, సాధనాల శాస్త్రీయవిశ్లేషణ యీ ముసాయిదా మార్గదర్శకసూత్రాల్లో అంతర్లీనంగావుంది. పైనపేర్కొన్న కార్యక్రమాలివి: ఆహారం, శక్తికార్యక్రమాలు, యింజనీరింగ్ పారిశ్రామికరంగాన్ని పెంపొందించడం, జాతీయార్థిక వ్యవస్థను రసాయనికీకరించడం, వినిమయసరకుల వుత్పత్తినీ, సేవలనుసమకూర్చే పారిశ్రామికరంగంలో వుత్పత్తినీ విస్తరించడం. 15 యేళ్ళకాలం యీ విధంగా వాస్తవికదృక్పథంతో దృష్టినిసారించడానికి వీలున్నకాలం; యిది జాగ్రత్తగాపరీక్షించిన ప్రాతిపతికపై ఆధారపడివుంది.

ఇరవయ్యోవశతాబ్దాంతంనాటికల్లా జాతీయార్థికవ్యవస్థ సాధించాల్సిన యీ లక్ష్యాలకు, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమ కొత్తకూర్పులోగల నిబంధనలప్రకారం పూర్తిగా అనుగుణమైన నిర్వచనంయిచ్చారు. జాతీయాదాయాన్నీ, పారిశ్రామికోత్పత్తినీ రెట్టింపు చేయాలని తలపెట్టారు. దేశవుత్పత్తి యంత్రాంగంలో గణనీయమైన పెరుగుదలా, మౌలికపరివర్తనావుంటాయి. ఫలితంగా రానున్న 15 యేళ్ళకాలంలో సృష్టించనున్న ఆర్థికశక్తిస్తోమతలు యిన్నాళ్లుగా సోవియట్ పాలనాకాలంలో సంచయించినదానికి దాదాపు సమానంగావుంటుంది; కమ్యూనిజానికి పాదార్థిక, సాంకేతిక ప్రాతిపదికను నిర్మించడంలో ఒక పెద్దముందంజవేయడం జరుగుతుంది.

ప్రజల జీవనప్రమాణాల్లో, సాంస్కృతికస్థాయిలో నిరాటంకమైన పెరుగుదలను కొనసాగించడమే సోషలిజంలోని సామాజికోత్పత్తి ప్రధాన లక్ష్యం. ప్రస్తుతదశలో, కమ్యూనిస్టుపార్టీ ప్రజలసంక్షేమాన్ని మరింతవున్నతమైన, గుణాత్మకంగా కొత్తదైన స్థాయికిపెంచే కర్తవ్యాన్ని నిర్దేశిస్తోంది.

మానవ కార్యకలాపాల ప్రధానరంగమైన శ్రమరంగంలోని సామాజికసమస్యల పరిష్కారానికి అధికతరప్రాధాన్యాన్నియివ్వడం జరిగింది. ప్రయాసకలిగించే, విసుగు పుట్టించేపనిని తగ్గించడం యిక్కడ ప్రధానకర్తవ్యం. దీనివల్ల శారీరకశ్రమభాగం సగానికిపైగాపడిపోతుంది. దీనివల్ల 20 మిలియన్లమందికిపైగా నైపుణ్యంలేనిపనిని చేయాల్సినఅవసరం లేకుండాపోతుంది; అంతేగాక, వీరిశ్రమను అర్థవంతమైనదిగా, తృప్తినిచ్చేదిగాచేస్తుంది.

వచ్చే 15 యేళ్ళలోగా ప్రజల పాదార్థికసంక్షేమానికీ, మేధాశక్తి అభివృద్ధికీ

సంబంధించిన తక్షణసమస్యలను మౌలికంగా పరిష్కరించేందుకు వీలుకల్పించడం జరుగుతోంది; యీ సమస్యలపరిష్కారం సమాజంలోని అన్నిబృందాల ప్రజలకూ ప్రత్యేకించి కీలకప్రాధాన్యంగలవి. వున్నతనాణ్యం, వైవిధ్యంగల సరకుల, సేవల పెరుగుతున్న సార్థకగిరాకీని పూర్తిగాతీర్చడం, తిండితీర్థాలవిషయంలో శాస్త్రీయంగా సిఫారసుచేసిన హేతుబద్ధమైన ప్రమాణాలనుచేరుకోవడం అని ముఖ్యంగా దీనర్థం. గొప్ప సామాజికప్రాధాన్యంగల కర్తవ్యాన్ని, అంటే దాదాపు ప్రతి సోవియట్ కుటుంబానికీ ప్రత్యేక గృహవసతిని—ఒక యింటివాటానో లేక యింటినో—కల్పించే కర్తవ్యాన్ని 2000వ సంవత్సరంనాటికల్లా నెరవేర్చాల్సివుంది. శక్తిస్తోమతలను, నిధులను గరిష్టస్థాయిలో సమకూర్చుకోవడమూ, యీ కీలకసమస్యపట్ల కేంద్రంలో, స్థానికంగా రెండుచోట్లా నిరంతరశ్రద్ధాసక్తులు కనబర్చడమూ దీనికవసరమౌతుంది.

విద్య, సిబ్బందిశిక్షణ, వైద్యసేవలవ్యవస్థను మౌలికంగా మెరుగుపర్చాల్సివుంది; సంస్కృతి, వినోదం, క్రీడలకు అవసరమైన పాదార్థికసదుపాయాలను యావత్తు సామాజికరంగానికీ గణనీయంగా విస్తరించాల్సివుంది.

మన పురోగతికి అవసరమైన సామర్థ్యాన్నీ, పెరుగుదలరేట్లనూ గణనీయంగా పెంచడంద్వారామాత్రమే సామాజికోత్పత్తికీ, జీవనప్రమాణానికీసంబంధించిన యీ లక్ష్యాలను నిర్దేశితకాలపరిమితిలో సాధించగలమనేమాట వాస్తవం.

పెరుగుదలరేట్లు పార్టీ ఆర్థికవిధానంలో ప్రధాన అంశంగా సర్వదావుంటూవచ్చాయి, వుంటాయికూడా. దేశసామాజిక-ఆర్థికాభివృద్ధిని త్వరితంచేసేందుకు సంబంధించిన భావన దృష్ట్యా, యీనాడు యిదిఒక మౌలికప్రాముఖ్యాన్నీ, నూతన వస్తువునూ సంతరించుకుంటోంది.

మొదటివిషయం జాతీయాదాయానికి మరింత శక్తివంతమైన స్వభావాన్ని సంతరింపజేయడానికి యేర్పాటుజరిగింది. దీని పెరుగుదలరేటును గత పంచవర్షప్రణాళికా కాలంలోవుండిన వార్షికసగటురేటుఅయిన 3.1 శాతంనుండీ 14 వ పంచవర్ష ప్రణాళికాకాలం నాటికి 5 శాతానికి పెంచాల్సివుంది. దీంతో గత మూడు పంచవర్షప్రణాళికాకాలాల్లో తగ్గుముఖంలోవున్న పెరుగుదలరేట్ల ప్రతికూలధోరణి నిల్చిపోతుంది. జాతీయాదాయం పెరుగుదలరేటు నిరపేక్షలెక్కల్లో చెప్పాలంటే యింకాయెక్కువగా వుండాలి. ఫలితంగా, పైనపేర్కొన్నకాలంలో గడించాల్సిన జాతీయాదాయం మొత్తం దాదాపు

12,000 బిలియన్లరూబుళ్ల వుంటుంది; యిది గతంలో సోవియట్ పరిపాలనాకాలంలో గడించిన మొత్తంఆదాయానికన్నా యెక్కువగావుంటుంది. ఆర్థిక, సామాజికకర్తవ్యాలను యేకకాలంలో భారీయెత్తున నెరవేర్చడానికి యీ జాతీయాదాయంలో అభివృద్ధిరేట్ల పెరుగుదలా, నిరపేక్షలెక్కల్లో జాతీయాదాయం పెరుగుదలా కీలకం. అంతేకాదు, దేశరక్షణసామర్థ్యాన్ని తగినస్థాయిలో వుంచడానికికూడా యిదెంతో అవసరం.

రెండవవిషయం. వుత్పత్తిని త్వరితంచేసేక్రమంలో, పెరుగుతున్న, మారుతున్న సామాజికావసరాలను మరింత సమగ్రంగా దృష్టిలోవుంచుకునేటువంటి, మరింత సమతూకంతోకూడిన వుత్పత్తిస్వరూపాన్ని రూపొందించాల్సివుంది; అంటే అభివృద్ధిలోని ప్రతిఒక్కశాతంపాయింటూ, ప్రతిరూబులూ గుణాత్మకంగా కొత్తవైన, ఫలప్రదమైన వున్నతవినిమయ లక్షణాలుగల వుత్పత్తులను, జాతీయార్థికవ్యవస్థకు, ప్రజలకుకావాల్సిన వుత్పత్తులను సూచించాలని దీనర్థం. ఆర్థికాభివృద్ధికి సంబంధించిన ప్రస్తుత వ్యూహ దశలో యిది నిరంతరం అవసరం.

మూడవదీ, అత్యంతముఖ్యమైనదీ. మౌలికంగా కొత్తప్రాతిపదికపై, సర్వతోముఖమైన, స్థిరమైన సాంద్రీకరణ ప్రాతిపదికపై వున్నతఅభివృద్ధిరేట్లను సాధించడం. యీ కర్తవ్యాన్ని నిర్దేశించడంలో పార్టీ దీన్ని నెరవేర్చడానికి ఒక ప్రధానమైనపద్ధతిని సూచిస్తోంది: అది ప్రధానంగా శాస్త్ర, సాంకేతికప్రగతిని త్వరిత పర్చడం, విజ్ఞానశాస్త్రాన్నీ, సాంకేతికపరిజ్ఞానాన్నీ వుపయోగించి వున్నతరేట్లను సాధించడం. యిది మనప్రగతికి వుత్ప్రేరకము; దీని వినియోగం ఒకపంచవర్షప్రణాళికా కాలానికీ, మరొక పంచవర్షప్రణాళికాకాలానికీ పెరుగుతూనేవుంటుంది.

సాంద్రీకరణ సమస్యను పార్టీ సమగ్రమైన, విస్తృతమైనరీతిలో పరిశీలిస్తోంది. మన ఆర్థికవ్యవస్థ ఒకస్థాయికి చేరుకుంది: అది యెలాంటిస్థాయిఅంటే మునుపటిలాగా వనరుల నికరమైన పెరుగుదలవల్లగాక, వుత్పత్తి సర్వతోముఖ సాంద్రీకరణ, యెలాంటి మినహాయింపులులేని సంపూర్ణసాంద్రీకరణవల్లమాత్రమే మన ఆర్థికవ్యవస్థ అభివృద్ధి చెందగలుగుతుంది; యెంతోవేగంగా అభివృద్ధిచెందుతుంది. శ్రమవుత్పాదకతను యెంతో పెంచడానికేగాక, వుత్పత్తిలో ప్రతియూనిట్‌కు అవసరమయ్యే పదార్థాలను తగ్గించడానికీ ఆస్తులతోపోలిస్తే వుత్పత్తులపరిమాణాన్ని పెంచడానికీ, విడివిడిపరిశ్రమలనేగాక, యావత్తు జాతీయార్థికవ్యవస్థకు సాంద్రీకరణకు మళ్ళించడానికీ పథకంవేయడం జరిగింది. యిదొక్కటే ఆర్థిక, సామాజికాభివృద్ధిని త్వరితంచేసే నమ్మకమైనమార్గం.

సోషలిజపు మౌలికసమస్యల పరిష్కారానికి సామాజికశ్రమ వుత్పాదకతను పెంచడమే వుత్తరోత్తరా ప్రధానలక్ష్యంగావుంటుంది. లెనిన్ మనకు నిర్దేశించిన కార్యక్రమలక్షిత కర్తవ్యాన్ని అమలుజరపడానికి, అంటే అత్యంతవున్నత ప్రపంచ స్థాయిని చేరుకోడానికి నిర్ణయాత్మకచర్యను వచ్చే 15 యేళ్ళలో తీసుకుంటాం. 2000వ సంవత్సరంనాటికల్లా యావత్తు జాతీయార్థికవ్యవస్థలో శ్రమవుత్పాదకతను 2.3-2.5 రెట్లు పెంచడానికి యీ మార్గదర్శకసూత్రాలు వీలుకల్పిస్తున్నాయి. ఫలితంగా సోవియట్ ఆర్థికవ్యవస్థ గుణాత్మకంగా కొత్తదైన అభివృద్ధిపథంలో ప్రవేశిస్తుంది: శ్రామికబలగాల ఆవశ్యకత తగ్గుదలతోపాటు వుత్పత్తిపెరగడానికి మొట్టమొదటిసారిగా హామీలభిస్తుంది; అనేకసామాజికసమస్యల పరిష్కారానికి అవకాశాలు మునుపెన్నడూ లేనంత యెక్కువ లభిస్తాయి. యిదంతా జాతీయార్థికవ్యవస్థకుగల అత్యంతశక్తివంతమైన లక్షణానికి అనుగుణంగా శ్రామికబలగాలను హేతుబద్ధంగా పంపిణీచేసేపద్ధతిని రూపొందించేందుకు వీలుకల్పిస్తుంది; అదేసమయంలో, యిది ప్రజలశ్రమను పూర్తిగా, ఫలప్రదంగా వుపయోగించుకోడానికి హామీనిస్తుంది; సోషలిస్టుసమాజవ్యవస్థనుండీ, అంతస్సారం నుండీ వుద్భవించేది యిదే.

మనం పరిశీలిస్తున్న పత్రంలో అంతర్లీనంగావున్నది యేమంటే ఆర్థిక వ్యవస్థకు కావాల్సిన పాదార్థికవనరుల అవసరాన్ని తీర్చడానికి మౌలికంగా కొత్తదైనవైఖరే. గత సంవత్సరాల్లో యీ అవసరాన్ని ప్రధానంగా వుత్పత్తి పెంపుదలద్వారా తీర్చగా, యింధనం, శక్తి, ముడిపదార్థాలు, లోహం, యితరపదార్థాల అవసరాలపెరుగుదలలో 75-80 శాతం వీటిని పొదుపుగా వినియోగించడంద్వారా తీర్చుకోవడం దీర్ఘకాల కర్తవ్యమౌతుంది. జాతీయార్థికవ్యవస్థకు యీ విధానం యెంత ఫలదాయకమైనదో యీ కింది వుదాహరణ తెలియజేస్తుంది. ఆర్థికాభివృద్ధిలక్షణం మారకుండా స్థిరంగావుండాలంటే, యీ శతాబ్దాంతంనాటికి ప్రస్తుతం నిర్ణయించుకున్న దానికన్నా దాదాపుమరో 50 మిలియన్లటన్నుల ఉక్కుబద్దీలు, రేకులు మనకవసరమౌతాయి. వనరులనుపొదుపుచేసే లక్ష్యంగల యీ పంథాను అమలుజరపడంవల్ల వుత్పత్తిలో ప్రతిఒక్క యూనిట్‌కు అవసరమయ్యే విద్యుత్‌సాంద్రతా, పదార్థాల ఆవశ్యకతా గణనీయంగా తగ్గుతుంది.

సాంద్ర అభివృద్ధివల్ల, వుత్పత్తియంత్రాంగాన్ని సాంకేతికంగా మెరుగుపర్చడంవల్ల అది వుత్పత్తికీ, స్థిరాస్తికీ మధ్యగల నిష్పత్తివిషయంలో ప్రత్యేకించి అధికతరబాధ్యతలను మోపుతుంది. యీ నిష్పత్తితగ్గుదలదిశలో యెదురౌతున్న ప్రతికూలధోరణిని యిప్పటికీ

అధిగమించలేకపోవడం విచారకరం. రానున్న 15 యేళ్ళలో యీ సూచీ మార్పులోనైతం ఒక మలుపును సాధించాలని తలపెట్టారు: మొదటిదశలో—అంటే 1990 లలో—వుత్పత్తికీ, స్థిరాస్తికీ మధ్యగల నిష్పత్తిని స్థిరీకరించడం; తర్వాత యీ నిష్పత్తిలో వుత్పత్తివాటా పెరగడానికి హామీనివ్వడం.

శాస్త్ర, సాంకేతిక విప్లవవిజయాల ప్రాతిపదికపై జాతీయార్థికవ్యవస్థలో కొత్త యంత్రాలను అమర్చడం నిజంగా చరిత్రాత్మకప్రాముఖ్యంగల కర్తవ్యం. యిలా జరిగి నప్పుడుమాత్రమే, యావత్తు సర్వతోముఖ సాంద్రీకరణ గట్టిప్రాతిపదికపై ఆధార పడుతుంది. దేశపాదార్థిక, సాంకేతిక ప్రాతిపదికను వేగంగా పునర్నిర్మించడమనీ, గుణాత్మకంగా మెరుగుపర్చడమనీ దీనర్థం. దాని వున్నతస్థాయిని స్థిరంగా కొనసాగించడం, ప్రపంచం సాధించినవిజయాలకు అవి అనుగుణంగావుండేట్టుచూడడం చాలా ముఖ్యం. యీ క్రమం అన్నిపరిశ్రమలకూ పరివ్యాప్తంకావాలి. వుత్పత్తిఆస్తులను స్థిరంగా పునరుద్ధరించే ఒక నిర్దిష్టకార్యక్రమం ప్రతిఒక్క మంత్రిత్వశాఖకూ, ప్రతికర్మాగారానికీ వుండాలి. దాన్ని అవి పట్టుదలతో అమలుజరపాలి. ఆర్థికసమస్యలేగాక ముఖ్యమైన సామాజికసమస్యల పరిష్కారానికూడా యిది అత్యవసరం.

దీర్ఘకాలిక ఆర్థికాభివృద్ధికోసం, ప్రజల జీవనప్రమాణాల పెంపుదలకోసం పార్టీ నిర్దేశిస్తున్న ప్రధానకర్తవ్యాలు, లక్ష్యాలు యివి. యివి నిజంగా గొప్పలక్ష్యాలు. వీటి అమలు సామాజిక ప్రగతిపథాన దేశం గణనీయంగా పురోగమించేట్టుచేస్తుంది. ప్రపంచంలో దేశఆర్థికస్థానాలు గణనీయంగా పటిష్టమౌతాయి. దాని పర్యవసానంగా ప్రపంచంలో సోషలిజం ఆకర్షణశక్తి మరింత పెరుగుతుంది. తలపెట్టినదాన్ని అమలు జరపడానికి మన సమస్తకృషినీ, శక్తిసోమతలనూ సమీకరించాల్సివుంటుంది. సోషలిస్టు వుత్పత్తిపెరుగుదల అంశాలనన్నిటినీ ఆచరణలోకి తీసుకరావల్సివుంటుంది; సోషలిస్టు వుత్పత్తిసామర్థ్యాన్ని పెంచాల్సివుంటుంది.

మానవపరమైన అంశాన్ని సంపూర్ణంగా వుద్దీప్తంచేయడం యిక్కడ ప్రధాన మైనవిషయం. మన ప్రణాళికలను అమలుపర్చడానికి, వాటిని నిర్దిష్టకార్యాచరణలుగా మార్చడానికితోడ్పడేది శ్రమ, శ్రమఒక్కటే. అందువల్లే, ప్రతిఒక్క శ్రామికుడు పార్టీ కార్యక్రమలక్ష్యాలకు దీక్షాంకితుడై తన ప్రయోజనాలకోసం, సమస్త సమాజ ప్రయోజనాలకోసం వాటిని సాధించేందుకు పనిచేయడం, తన అతిముఖ్య ఆశయంగా పరిగణించడం అతని కీలకమైన రాజకీయకర్తవ్యం. మన దేశసౌభాగ్యానికి, కమ్యూనిజాన్ని నిర్మించడంలో కొత్త విజయాలకు అదినమ్మదగిన హామీ.

నిర్ణయించిన సర్దుబాట్లలోతును, పరిమాణాన్నిబట్టి జాతీయార్థికవ్యవస్థ మేనేజిమెంటును ఒక కొత్త, మరింతవున్నతమైనస్థాయికి పెంచాల్సివుంటుంది. అన్ని పరిశ్రమలకూ, రిపబ్లిక్కులకూ వచ్చే 15 యేళ్ళకు స్పష్టమైనలక్ష్యాలుండాలి,యీ విధంగా మాత్రమేమనం మన అభివృద్ధిదశలను స్పష్టంగా నిర్దేశించగలం. ప్రస్తుత శతాబ్దం ముగిసేవరకూగలకాలంలో ఆర్థికమేనేజిమెంట్ లక్ష్యాల్లో, యెత్తుగడల్లో పారంపర్యత వుండేట్టుచూడగలం; పార్టీ ఆర్థికవ్యూహాన్ని అమలుపర్చడంలో ప్రతిఒక్క పంచవర్ష ప్రణాళికస్థానాన్నీ, పాత్రనూ నిర్వచించగలం.

# III. 12వ పంచవర్ష ప్రణాళిక— పార్టీ ఆర్థికవ్యూహాన్ని అమలుజరపడంలో ఒక కీలకదశ

పార్టీ దీర్ఘకాలిక ఆర్థికవ్యూహాన్ని ఆచరణాత్మకంగా అమలుజరపడంలో 12 వ పంచవర్షప్రణాళిక ఒక మౌలికమైన, అత్యంతముఖ్యమైనదశ. యీ కాలంలో మన ఆర్థికవ్యవస్థలో విస్పష్టమైన పెరుగుదలకనిపించాలి. దీన్ని వున్నత అభివృద్ధిమార్గంలో పెట్టాలి, అంటే అభివృద్ధిని త్వరితపర్చే మార్గమన్నమాట.

*ఈ పంచవర్ష ప్రణాళిక ప్రధానకర్తవ్యాన్ని* పైజెప్పినవైఖరుల ఆధారంగా నిర్వచించడంజరిగింది. శాస్త్ర, సాంకేతికప్రగతిని త్వరితంచేయడంద్వారా పెరుగుదల రేట్లను, ఆర్థికాభివృద్ధిసామర్థ్యాన్నిపెంచడం, పరిశ్రమలకు కొత్తపరికరాలను అమర్చడం, వాటిని సాంకేతికంగా పునర్వ్యవస్థీకరించడం, ప్రస్తుతమున్న వుత్పత్తిస్తోమతలను ముమ్మరంగా వినియోగించుకోవడం, ఆర్థిక మేనేజిమెంట్వ్యవస్థను, ఆర్థికయంత్రాంగాన్ని మెరుగుపర్చడం, దీని ప్రాతిపదికపై సోవియట్ ప్రజల జీవనప్రమాణాల్లో యితోధిక పెరుగుదలనుసాధించడం—యివి యీ ప్రధానకర్తవ్యంలో యిమిడివున్నాయి.

కామ్రేడ్ ప్రతినిధులారా, మార్గదర్శకసూత్రాల ముసాయిదాలో సామాజికోత్పత్తి పెరుగుదలకు, సామర్థ్యానికిసంబంధించి పేర్కొన్న సూచికలు 12 వ పంచవర్షప్రణాళిక ప్రధానలక్ష్యాన్ని సాధించేందుకు పూర్తిగా హామీకల్పిస్తాయని మీకు చెప్పడానికి నన్ను అనుమతించండి.

అభివృద్ధిరేట్ల పెరుగుదలలో, నిరపేక్షలెక్కల ప్రకారం కీలక ఆర్థికసూచీల్లో జాతీయార్థికవ్యవస్థకుగల చలనశీలస్వభావం కళ్ళకుకట్టినట్టు, సందేహానికి తావులేకుండా ప్రతిబింబించింది. 1986-1990 మధ్యకాలంలో జాతీయాదాయం 1.6 రెట్లు పెరుగుతుంది.

గత ఐదేళ్ళలో యీ సూచీలో తగ్గుదలకనిపించింది; దీన్ని గమనించాలి.

| | నిరపేక్షలెక్కల్లో అభివృద్ధిరేటు (బిలియన్ల రూబుళ్ళలో) | | సగటు వార్షిక పెరుగుదలరేటు (శాతంలో) | |
|---|---|---|---|---|
| | 1980 తో పోలిస్తే 1985 లో | మార్గదర్శక సూత్రాల ముసాయిదా ప్రకారం 1985 తో పోలిస్తే 1990 లో | 11 వ పంచవర్ష ప్రణాళికలో | మార్గదర్శకసూత్రాల ముసాయిదా ప్రకారం 12 వ పంచవర్ష ప్రణాళికలో |
| జాతీయాదాయంలో వినిమయం, సంచయనాల వాటా | 71 | 96_111 | 3.1 | 3.5_4.0 |
| పారిశ్రామికోత్పత్తి | 135 | 169_194 | 3.7 | 3.9_4.4 |
| పారిశ్రామికోత్పత్తిలో వుత్పత్తి సాధనాలు (ఎ గ్రూప్) | 99 | 123_142 | 3.6 | 3.7_4.2 |
| పారిశ్రామికోత్పత్తిలో వినిమయసరకులు (బి గ్రూప్) | 36 | 46_52 | 3.9 | 4.1_4.6 |
| వ్యవసాయోత్పత్తి (గత పంచవర్ష ప్రణాళికాకాలం లోని సగటు వార్షిక వుత్పత్తి పెరుగు దలతో పోలిస్తే— 1983 నాటి ధరల ప్రకారం) | 11 | 28_32 | 1.1 | 2.7_3.0 |
| చిల్లర వ్యాపార టర్నోవర్ | 46 | 59-73 | 3.1 | 3.4_4.0 |
| డబ్బుతీసుకుని ప్రజానీకానికిచేసే సేవలపరిమాణం | 9.8 | 13.7_18.2 | 5.0 | 5.4_7.0 |

ఫలితంగా, 1990 లో జాతీయాదాయం 614 బిలియన్ల రూబుళ్ళకు చేరుకుంటుంది. పారిశ్రామికోత్పత్తి పరిమాణం ఒక ట్రిలియన్ రూబుళ్ళకు పెరుగుతుంది. యిరవయ్యవ శతాబ్దపుచివరి దశాబ్దారంభంనాటికి మన ఆర్థికవ్యవస్థకు విలక్షణంగా వుండబోయేరేట్లు, పరిమాణాలు యివి.

12 వ పంచవర్ష ప్రణాళికకు మరో విలక్షణతవుంటుంది. ఆ తర్వాతి పదేళ్ళలో దేశసామాజిక-ఆర్థికాభివృద్ధి పెరుగుదలరేటు పెంపుదలకు పునాదివెయ్యడం దీని లక్ష్యం. ఆర్థిక సమతూకాలను రూపొందిస్తున్నప్పుడు పెట్టుబడిమదుపుల విధానంపట్ల ప్రత్యేకశ్రద్ధ కనబర్చాల్సిన ఆవశ్యకతనుగురించి యిది నిర్దేశించింది. గత మూడుపంచవర్ష ప్రణాళికా కాలాల్లో వాటి పెరుగుదలరేటులో విలకడగా, గణనీయమైన తగ్గుదల కనిపించింది; దీనిమూలంగా స్థిరాస్తుల పునరుద్ధరణా, స్తోమతల పెరుగుదలరేటూ, చివరకు మొత్తం ఆర్థికాభివృద్ధీ మందగించాయి.

గత ఐదేళ్ళలో వుత్పత్తిలో మదుపుల పెరుగుదలరేటు 16 శాతం వుండింది, కాగా ఆర్థికాభివృద్ధిని త్వరితంచేసేపంథాను దృష్టిలోపెట్టుకుని 12 వ పంచవర్ష ప్రణాళికాకాలంలో యీ మదుపుల పెరుగుదలరేటును 25 శాతానికి పెంచడం ఆవశ్యకమని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ భావించింది. సహజంగానే, యిందుకు జాతీయాదాయ పంపిణీలోని నిష్పత్తుల్లో కొన్నిమార్పులు—అంటే సంచయననిధికి కేటాయించేవాటాను పెంచడం—చేయాల్సివుంటుంది. ప్రస్తుత, దీర్ఘకాలికలక్ష్యాలను సాధించేందుకు యీ చర్య అవసరం. ఆ తర్వాత సంచయనవాటాను స్థిరీకరించడం జరుగుతుంది; యింకా చెప్పాలంటే కొంతమేరకు తగ్గుతుంది.

సామాజికోత్పత్తి సామర్థ్యం పెరిగినట్టి పరిస్థితుల్లో యీ చర్య అమలుజరుగుతుందని నొక్కిచెప్పాల్సివుంది; సోవియట్ ప్రజల జీవనప్రమాణాన్ని నిర్ధారించే వినిమయ నిధి నిరపేక్షపరిమాణాలను గణనీయంగా పెంచడానికి సామాజికోత్పత్తి సామర్థ్యం పెంపుదల వీలుకల్పిస్తుంది. నేను కొన్నిగణాంకవివరాలను యిస్తాను. వినిమయనిధి గత ఐదేళ్ళలో 55 బిలియన్ల రూబుళ్ళువుండగా, అది 12 వ పంచవర్ష ప్రణాళికాకాలంలో 74 బిలియన్ల రూబుళ్ళకు పెరుగుతుంది. ప్రజల వాస్తవాదాయాలు మరింత శీఘ్రగతిన పెరుగుతాయి. మన ప్రణాళికల సామాజికవున్ముఖతను సాంద్రీకరించేదిశగా పార్టీ చేపట్టిన పార్టీదీర్ఘకాలికపంథాకు యీ అభివృద్ధిసరళి పూర్తిఅనుగుణంగావుంది.

తక్షణఆర్థిక, రాజకీయకర్తవ్యాన్ని, అంటే జాతీయార్థికవ్యవస్థను సాంద్రఅభివృద్ధి మార్గానపెట్టేకర్తవ్యాన్ని నెరవేర్చేందుకు 12 వ పంచవర్ష ప్రణాళికాకాలంలో నిర్ణాయకమైన చర్యను తీసుకోవాల్సివుంది. కీలకమైనవనరుల వినిమయపెరుగుదలరేట్లను గణనీయంగా

తగ్గిస్తూ, అదేసమయంలో పనికి సంబంధించిన గుణాత్మక సూచీలన్నిటీ్ని మెరుగుపరుస్తూ తుదిఫలితాల పెరుగుదలకు వీలుకల్పిస్తున్నాం.

| | ఐదేళ్ళలో పెరుగుదల (శాతంలో) | | అభివృద్ధి రేట్లలో పెరుగుదల (+) తగ్గుదల (—) |
|---|---|---|---|
| | 1981_1985 | మార్గదర్శక సూత్రాల ముసాయిదా ప్రకారం 1986_1990 లో | |
| i. ఉత్పత్తి ఫలితాలు | | | |
| జాతీయాదాయంలో వినిమయ, సంచయనాల వాటా | 17.0 | 19_22 | +2.5 |
| పారిశ్రామికోత్పత్తి | 20.0 | 21_24 | +1.4 |
| వ్యవసాయోత్పత్తి (సగటు వార్షిక పరిమాణం) | 6.0 | 14_16 | +8_10 |
| ii. కీలకవనరులు | | | |
| పాదార్థికోత్పత్తిలో నిమగ్నమైనవారి సంఖ్య | 2.3 | 0.5 | —1.8 |
| వుత్పత్తి స్థిరాస్తులు | 37.0 | 30.0 | —7 |
| శ్రమగ్రహీతల వుత్పత్తి | 17.0 | 15.0 | —2 |

గత పంచవర్ష ప్రణాళికాకాలంలో సామాజికశ్రమవుత్పాదకత 16.5 శాతం వుండగా దీన్ని 20_23 శాతం పెంచాలని మార్గదర్శకసూత్రాలు తలపెట్టాయి. జాతీయాదాయంలో, పరిశ్రమల వుత్పత్తుల్లో పాదార్థికోత్పత్తికిచెందిన యితర అన్నిశాఖల్లో దాదాపు మొత్తం పెరుగుదలను అధికతరశ్రమ వుత్పాదకతద్వారామాత్రమే సాధించాలని మొట్టమొదటిసారిగా తలపెట్టడంజరిగింది. నూతనపంచవర్ష ప్రణాళికకుగల మౌలిక విలక్షణతల్లో యిదొకటి. యీ కాలంలో శ్రామికబలగాల పెరుగుదలరేటుతగ్గి, కేవలం 3,200,000 మందిమాత్రమేవుంటారు. శ్రమవుత్పాదకతలో ప్రణాళికాబద్ధమైన పెరుగుదల లేకపోయినట్లయితే జాతీయార్థికవ్యవస్థకు అదనంగా 22 మిలియన్లమందికిపైగా అవసరమౌతారు. అంతటి శ్రామికబలగాలు మనకు యెంతమాత్రమూలేవు. 12వ పంచవర్ష

ప్రణాళికాకాలంలో లభించే పెరుగుదలతో సర్దుకోవడమేగాకుండా, దాదాపు ఆ మొత్తం పెరుగుదలను విద్య, ఆరోగ్యసంరక్షణ, యితరసామాజిక, సాంస్కృతికరంగాలకు మళ్ళించడం సాధ్యమనిపిస్తోంది; కాగా గత ఐదేళ్ళలో పెరిగిన శ్రామికబలగాలను వుత్పాదక, అనుత్పాదకరంగాలమధ్య సమానంగా పంపిణీచేయడం జరిగింది.

పార్టీ రూపొందించిన పంథాకు అనుగుణంగా శక్తి, ముడిపదార్థాల, యితర పదార్థాల విషయంలో అదనపుఅవసరాలనుతీర్చే ప్రధాన మూలాధారంగా ఆర్థికవ్యవస్థను మార్చడంలాంటి ముఖ్యమైనకర్తవ్యాన్ని నెరవేర్చడమనేది చెప్పుకోదగినంతత్వరితంగా జరగాలి. కీలకవనరుల అవసరాల పెరుగుదలలో 60-65 శాతాన్ని రానున్నఐదేళ్ళలో యీ మూలాధారంద్వారా తీర్చాలని తలపెట్టడంజరిగింది. ఫలితంగా, 1990 లో పాదార్థిక కేటాయింపుల్లోఅయ్యే పొదుపు మొత్తంజాతీయార్థికవ్యవస్థలో రెండింతలవుతుంది. యీ స్థాయిలో వనరులను పొదుపుచేయడమనేది మనదేశంలో యిదివరకెన్నడూలేదు; యిది మన అభివృద్ధిలోని ప్రస్తుతదశ వస్తుగతఅవసరాలను ప్రతిబింబిస్తోంది.

వనరులను పొదుపుచేసే సమస్యను పరిష్కరించే పద్ధతులు వైవిధ్యపూరితమైనవి. మొదటిది. అత్యంతాధునిక సాంకేతికపరిజ్ఞానాన్ని, అత్యంతాధునికవుత్పత్తి సాంకేతిక పద్ధతులను, వ్యవస్థీకరణకు సంబంధించిన ఆధునికరూపాలను, సమర్థమైన ఆర్థిక యంత్రాంగాన్ని విస్తృతంగా వినియోగించుకోవడమని దీనర్థం. యింతటిబ్రహ్మాండమైన కృషిలో శ్రామికప్రజలందరూ, సోవియట్ ప్రజలందరూ ప్రేరేపితులై, క్రియాశీలంగా పాల్గొనగలిగినటువంటి పాదార్థిక, నైతికవాతావరణం ప్రతిఒక్కసమిష్టిశ్రామికబృందంలో వుండడం దీనర్థమవడంలో సందేహంలేదు.

అప్రధానమైన వనరులను సాధ్యమైనంత యెక్కువ మేరకు వుపయోగించుకోవడమనికూడా దీనర్థం. యీ విషయంలో విడివిడిరిపబ్లిక్కులు, వుదాహరణకు ఉక్రెయిన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కు గణనీయమైన సానుకూల అనుభవం గడించినప్పటికీ పారిశ్రామిక వినిమయంలో యిలాంటి వనరులను వినియోగించుకుంటున్న నిష్పత్తి యిప్పటికీ చెప్పుకోదగినంతగాలేదు. సోదరసోషలిస్టుదేశాలు కూడా యీ రంగంలో గమనార్హమైన విజయాలు సాధించాయి. అప్రధానమైన ముడిపదార్థాల నిష్పత్తిని భవిష్యత్తులో గణనీయంగా, అంటే సగటున కనీసం 10-12 శాతంపెంచాలని తలపెట్టాం. యీ విషయంపట్ల మంత్రిత్వశాఖాధిపతులు, యూనియన్ రిపబ్లిక్కుల నాయకులు తమ వైఖరిని మౌలికంగా మార్చుకోవాలి. అలంకారికంగాచెప్పాలంటే, తరచుగా జరుగుతున్నదేమిటంటే, వారు అపారసంపత్తిపై కూచుని, అదేసమయంలో ముడిపదార్థాల కొరతవున్నట్టు ఫిర్యాదుచేస్తున్నారు. అంతేగాక పరిసరాలకు జరుగుతున్న విపరీతమైనహానినికూడా గమనించాలి. అప్రధానమైన వనరులను వుపయోగించుకునే విషయాన్ని సోవియట్ యూనియన్ ప్రభుత్వప్రణాళికా

కమిటీ, సోవియట్ యూనియన్ ప్రభుత్వసరఫరాలకమిటీ సూత్రబద్ధమైన స్థానాలనుండీ దేశప్రయోజనాలను బాగాగు ర్తెరిగి పరిశీలించాలి.

సమర్థతను పెంపొందించడానికి సంబంధించిన ప్రధానసమస్యల్లో వుత్పత్తి నాణ్యత, పనినాణ్యత అత్యంతతీవ్రమైనదీ, తక్షణమైనదీ అని నేను చెప్పగలను. యిది ఆర్థికసమస్యమాత్రమేగాక రాజకీయసమస్యకూడా: అనేకరకాల వుత్పత్తులపరిమాణం విషయంలో మనం స్వల్పకాలవ్యవధిలోనే ప్రపంచంలోని అగ్రస్థానాలకుచేరుకున్నాం. యిప్పుడు మనం నాణ్యతాసమస్యను సడలింపులులేని పట్టుదలతో పరిష్కరించగలం, పరిష్కరించితీరాలి. నాణ్యతకు సంబంధించి ప్రస్తుతమున్న పరిస్థితిని మౌలికంగా మెరుగుపర్చకుండా ముఖ్యమైన యేఒక్కవుత్పత్తి సమస్యనుగానీ, సామాజికసమస్యను గానీ పరిష్కరించలేనిదశకు మన జాతీయార్థికవ్యవస్థ చేరుకుంది.

అంతిమవిశ్లేషణలో, వుత్పత్తినాణ్యతను మెరుగుపర్చేసమస్య దాని పరిమాణానికీ, వనరులపొదుపునకూ, సమాజావసరాలను మరింత సంపూర్ణంగా తీర్చడానికీ సంబంధించిన సమస్యకూడాఅని విశదమౌతోంది. నేను ఒకవుదాహరణమాత్రమే యిస్తాను. దేశంలో టైర్లసమస్య యెంతతీవ్రంగావుందో అందరికీతెలుసు; యీ విషయం పెట్రోరసాయనాల పరిశ్రమల మంత్రిత్వశాఖకుకూడా తెలుసు. టైర్లమన్నికనుపెంచడం యీ సమస్యకు అత్యంతహేతుబద్ధమైన పరిష్కారం. యీ సూచీని 10 శాతం పెంచినట్లయితే అది యేటా ఆరుమిలియన్లటైర్ల వుత్పత్తికి సమానంగావుండగలదు. యిది దాదాపు ఆర్థిక వ్యవస్థ అవసరాలను, ప్రజల అవసరాలను తీర్చడంలో యీనాడు మనకు వీటికొరత యెంతవుందో అంతకు సమానం. యిలాంటి వుదాహరణలను యెన్నయినాయివ్వవచ్చు.

రానున్నఐదేళ్ళలో అత్యున్నతనాణ్యతగల పారిశ్రామికోత్పత్తుల విస్తృతిని సుమారు రెట్టింపుచేయాలని మార్గదర్శకసూత్రాల ముసాయిదాలోవుంది. యీ సందర్భంగా, ధ్రువీకరణపాత్రను, ప్రాముఖ్యాన్ని గణనీయంగాపెంచడం అవసరం. నాసిరకం వుత్పత్తికి అలవాటుపడిన పారిశ్రామికసంస్థలకు పాదార్థిక, నైతికశిక్షను విధించగల ఆర్థికయంత్రాంగాన్ని సమర్థంగా వినియోగించుకోవడం యీనాటి తక్షణసమస్య. యిందుకు భిన్నంగా, వున్నతనాణ్యతగల అధునాతన వుత్పత్తులను తయారుచేస్తున్న సమిష్టిశ్రామిక బృందాలకు—యిలాంటి బృందాలు మనకు యెన్నోవున్నాయి—ప్రోత్సాహమివ్వాలి; యీ ప్రోత్సాహం వుదారంగావుండాలి. యీ విషయంలో ముఖ్యమైన నిర్ణయాలను తీసుకున్నాం: వేతనాలకు గణనీయమైన చేర్పులను, సడలింపులులేని అంశాలను ప్రవేశపెట్టాం. నాణ్యతకు సంబంధించిన నూతనఅపేక్షితాలు హఠాత్తుగా మీదపడ్డాయని భావించకుండా పారిశ్రామికసంస్థలూ, అసోసియేషన్లూ తమపనిని శీఘ్రంగా పునర్వ్యవస్థీకరించుకోవాలి.

నాణ్యత పెరుగుదల అనేది దేశవ్యాప్తకర్తవ్యం; ఆధునికశాస్త్ర, సాంకేతిక విజయాలపై, శ్రామికప్రజాబాహుళ్యాల చొరవపై, సృజనాత్మకకృషిపై ఆధారపడి మేనేజిమెంట్ సంస్థలన్నీ, కర్మాగారాదిసంస్థలన్నీ, శ్రామికప్రజలందరూ కృషిచేయడం ద్వారామాత్రమే యీ కర్తవ్యాన్ని నెరవేర్చవచ్చు. యీ సందర్భంగా ప్రతిఒక్క సాధనాన్ని—ఆర్థిక, పరిపాలక, విద్యాపరమైనసాధనాలను—వినియోగంలోకి తీసుకరావాలి. యీ విషయంలో అరకొరచర్యలనుకూడా సహించజాలం. ఆమోదించిన నిర్ణయాలను అమలుజరపడంలో శక్తిని, పట్టుదలను, అచంచలతను అత్యధికంగా కూడదీసుకోవాలి. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ శ్రామికప్రజలనుద్దేశించి రాసిన లేఖలో నాణ్యతాసమస్యను విశదీకరించినతీరు యిదీ. దీన్ని పరిష్కరించాల్సిన తీరు యిదీ.

కా॥ మేడ్స్, వుత్పత్తి పెరుగుదలకోసం, ప్రజాసంక్షేమం మెరుగుదలకోసం మార్గదర్శకసూత్రాల ముసాయిదా అత్యంతబాధ్యతాయుతమైన, జటిలమైన లక్ష్యాలను నిర్దేశించింది. మన మాతృభూమిని రక్షించడానికి అవసరమైనదాన్నంతట్నీ సోవియట్ సాయుధబలగాలకు యీ ఐదేళ్ళలో సమకూర్చాలని మార్గదర్శకసూత్రాల్లోవుంది. పార్టీ దీర్ఘకాలిక వ్యూహానికి వూపునివ్వనున్న 12వ పంచవర్షప్రణాళిక మన ఆర్థికవ్యవస్థకు అన్నివిషయాల్లో—పెరుగుదలరేట్లదృష్ట్యా, సామర్థ్యందృష్ట్యా—ఒక మలుపుకావాలి. పంచవర్షప్రణాళికను పరిపూర్తిచేయడానికి మన వ్యవస్థీకరణకుకూడా యిది ఒక మలుపు కావాలి.

పంచవర్షప్రణాళికలపరిపూర్తికి సంబంధించి మనదృష్టిని వాటిచివరిసంవత్సరాలపై కేంద్రీకరిస్తున్నప్పుడు గతకాలపు గుణపాఠాల ప్రాతిపదికపై మనం నిర్ధారణలుచేయాలి. జాతీయార్థికవ్యవస్థ అభివృద్ధిరేట్లను ప్రస్తుత పంచవర్ష ప్రణాళికలోని మొదటియేడాదిఅయిన 1986లోనే సాధిస్తే అవి పంచవర్షప్రణాళికాలక్ష్యాలను సమతుల్యంగా కేటాయించడానికీ, ఆవిధంగా దాని పరిపూర్తికి వాస్తవికపరిస్థితులను సృష్టించడానికీ వీలుకల్పిస్తాయని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ఆదేశమొకటి పేర్కొంది. యిందుకోసం పంచవర్ష ప్రణాళికాకాలం ప్రారంభమైనప్పటినుండే కష్టించి పనిచేయడం అవసరం; యిదంతా తదుపరి సంవత్సరాలకు అవసరమైన లయబద్ధతను నిర్దేశిస్తోంది.

అందుబాటులోవున్న వ్యవస్థాత్మక, సామాజికశక్తిస్తోమతలను సమీకరించాలి; కాలాన్ని యేమాత్రం వృథాచేయరాదు; శీఘ్రతరాభివృద్ధికి సంబంధించిన కీలకమైన, దీర్ఘకాలిక అంశాలను, ముఖ్యంగా శాస్త్ర, సాంకేతికప్రగతికి సంబంధించిన అంశాలను చలనంలోపెట్టాలి. పనితాలూకు యీ లక్ష్యాలన్నిట్నీ జోడించడంద్వారామాత్రమే మనం ప్రణాళికలను అమలుజరపగలం, నిర్దేశితసామాజికలక్ష్యాలను సాధించగలం.

# IV. 12వ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఆర్థిక సాంద్రీకరణ మార్గాలు

## 1. శాస్త్ర, సాంకేతిక ప్రగతిని త్వరితంచేయడానికి సాంద్రీకరణే ప్రధానమార్గం

సర్వతోముఖ సాంద్రీకరణకు సంబంధించిన పార్టీవిధానం ప్రస్తుత శాస్త్ర, సాంకేతిక విప్లవదశలోని అపారమైన శక్తిస్తోమతలపై ఆధారపడివుంది. కమ్యూనిజాన్ని నిర్మించేందుకు మనం శాస్త్ర, సాంకేతికపరిజ్ఞానాలను కదలికలోపెట్టాలని లెనిన్ చెప్పిన మాటలు మునుపెన్నటికన్నా యీనాడు కాలానుగుణ్యంగావున్నాయి. యీనాడు శాస్త్ర, సాంకేతికపరిజ్ఞానాలను కదలికలోపెట్టడమంటే శాస్త్ర, సాంకేతికప్రగతికి సంబంధించిన అగ్రప్రాధాన్యరంగాల్లో కృషిని త్వరితంచేయడం, అధునాతనమైన ప్రతిఒక్కదాన్నీ శీఘ్రంగా, భారీస్థాయిలో అనువర్తింపజేయడానికి హామీకల్పించడం, వుత్పాదకశక్తులను గుణాత్మకంగా మార్చడం అని అర్థం. సోషలిస్టు కుటుంబదేశాలు శాస్త్ర, సాంకేతిక విజయాలను సంయుక్తంగా అభివృద్ధిచేసి, ఫలదాయకంగా వినియోగించడం, ప్రపంచ వ్యాప్త శ్రమవిభజనలో క్రియాశీలంగా పాల్గొనడంఅనికూడా దీనర్థం.

శాస్త్ర, సాంకేతిక ప్రగతిపట్ల మనదేశం యెల్లప్పుడూ ప్రత్యేకశ్రద్ధ కనబర్చింది. స్వల్పకాలవ్యవధిలోనే మనం శక్తివంతమైన విజ్ఞానశాస్త్ర స్తోమతలను నిర్మించుకున్నాం; అవి ప్రతిఒక్కదశలో ప్రధాన ఆర్థిక, రక్షణకర్తవ్యాలను విజయవంతంగా అమలు జరిపేందుకు మనకుతోడ్పడ్డాయి. కానీ, పరిశోధన, అభివృద్ధిసాధించిన ప్రసిద్ధమైన ఫలితాలు, పురోగామిభావనలు మనకు వున్నప్పటికీ, మనదేశంలో పుట్టించిన కొన్నిటితో సహా అధునాతన సాంకేతికపరిజ్ఞానాలను అభివృద్ధిచేయడంలో మనం తరచూ వెనకబడి వుంటున్నామనేవిషయం రహస్యమేమీకాదు. మంత్రిత్వశాఖలు తమ సాంకేతికవిధానంలో పొరపాటు అంచనాలువేయడం, కొన్నిసందర్భాల్లో భవిష్యత్తులోకి చూడడానికి వాటికి యిష్టంలేకపోవడంతప్ప యీ పరిస్థితికి మరోకారణం కనిపించదు.

శాస్త్ర, సాంకేతికప్రగతిమార్గంలోవున్న అవరోధాలను పూర్తిశక్తితోనిర్మూలించే, దాని అన్నిదిశల్లో ప్రధానమైన, విప్లవకరమార్పులకు హామీకల్పించే సమస్యను ప్రగాఢమైన విశ్లేషణప్రాతిపదికపై 1985 ఏప్రిల్‌లో జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్లీనరీసమావేశంలో, 1985 జూన్‌లో జరిగిన పార్టీ కేంద్రకమిటీ సమావేశంలో నిశితంగా లేవనెత్తడంజరిగింది. శాస్త్ర, సాంకేతికప్రగతిని త్వరితంచేసేందుకు పార్టీ

రూపొందించిన వ్యూహంలో యివి వున్నాయి: ఒకటి. శాస్త్ర, సాంకేతికపరిజ్ఞానాలను విస్తృతస్థాయిలో పురోగమింపజేస్తూ అందుబాటులోవున్న వనరులను కీలకరంగాల్లో కేంద్రీకరించడం; రెండవది. ఆచరణలో పరీక్షకుతట్టుకునినిల్చిన విశ్వసనీయమైన సాంకేతిక నూతనకల్పనలను భారీస్థాయిలో వినియోగించుకోడానికి అవకాశాలుకల్పించడం; దీనివల్ల ఆ నూతనకల్పనలకు కాలంచెల్లిపోకముందే వాటినుండీ సాధ్యమైనంత యెక్కువ ఫలితాలుపొందడానికి వీలుకలుగుతుంది; మూడవది. శ్రమవుత్పాదకతను యెంతగానో పెంచుతూ మౌలికంగా నూతన సాంకేతికవుత్పత్తిపద్ధతులకు దారితీయగల పరిశోధనను, అభివృద్ధిని త్వరితంగా, లక్ష్యశుద్ధితో కొనసాగించడం. 12వ పంచవర్ష ప్రణాళికాకాలంలో యీ సమస్యలను ఆచరణలో పరిష్కరించడం జరుగుతుంది.

అధునాతన వుత్పత్తిపద్ధతుల విస్తృతాభివృద్ధి—యిది శాస్త్ర, సాంకేతికప్రగతికి అత్యంతప్రధానమైనమార్గాల్లో ఒకటి. యీమార్గాన పయనించడంద్వారా వివిధరకాల వుత్పత్తుల్లోనేగాక, అన్ని పరిశ్రమల్లోకూడా మనం వాసిలో నూతనస్థాయికిచేరుకునేందుకు వీలుకల్పించే పురోగతిని సాధించగలం. 12వ పంచవర్షప్రణాళికాకాలంలో ప్రతిఒక్క పరిశ్రమలో మౌలికఅధునాతన సాంకేతికపరిజ్ఞానాల వినియోగాన్ని 1.5-2 రెట్లు విస్తరించదలచుకున్నాం. మౌలికంగా నూతనమైన వుత్పత్తిపద్ధతులు, వుదాహరణకు మెంబ్రేన్, లేజర్, ప్లాస్మా, అల్ట్రాహైప్రెజర్, యింపల్స్‌లోడ్స్, తదితరాలు ప్రముఖ స్థానం ఆక్రమిస్తాయి. యీ పద్ధతులను అనువర్తించేస్థాయి కొన్నిరెట్లు పెరుగుతుంది; అది నిస్సందేహంగా బ్రహ్మాండమైన ఆర్థికఫలితాలనిస్తుంది.

ఉత్పత్తిలో స్వయంచాలనీకరణ, యాంత్రీకరణ—యివి పనిచేసేప్రదేశాలను మౌలికంగా మార్చడానికీ, కార్మికుల, సమిష్టివ్యవసాయక్షేత్రరైతుల, బుద్ధిజీవులపనిని మరింత ఫలదాయకంగా, సృజనాత్మకంగా, ఆకర్షణీయంగాచేయడానికీ మరో మార్గం. పార్టీ స్వయానా నిర్దేశించుకున్న ప్రధానసామాజికలక్ష్యాల్లో యిదొకటి. జాతీయార్థికవ్యవస్థలో స్వయంచాలనీకరణస్థాయి నగటున రెట్టింపు అవుతుంది. పరిశ్రమల్లో దాదాపు 5,000 స్వయంచలితప్రక్రియ నియంత్రణావ్యవస్థలను ప్రవేశపెట్టనున్నారు.

కంప్యూటర్ సాంకేతికపరిజ్ఞానంలో సాధించిన విప్లవం ప్రాతిపదికపై, జాతీయార్థికవ్యవస్థలో కంప్యూటర్లను ప్రవేశపెట్టడంపై ప్రస్తుతదశలోని స్వయంచాలనీకరణ ఆధారపడివుంది. పాఠశాలల్లో విద్యాబోధనకోసం రానున్నసంవత్సరాల్లో అన్ని తరాల కంప్యూటర్లను, అంటే సూపర్‌కంప్యూటర్లు మొదలుకొని పర్సనల్‌కంప్యూటర్ల వరకూ రూపొందించి అభివృద్ధిచేస్తారు. యీ అయిదు సంవత్సరాల్లో కంప్యూటర్ల వుత్పత్తి 2.3 రెట్లు పెరుగుతుంది. అన్నిపరిశ్రమల్లో యంత్రాలను, యంత్రపరికరాలను పెద్దయెత్తున కంప్యూటర్లద్వారానడిపే, అలాంటి కంప్యూటర్లను వుత్పత్తిచేసే లక్ష్యాన్ని మనం నిర్దేశించుకుంటున్నాం. భవిష్యత్తు యీ సాంకేతికపరిజ్ఞానానిదే.

12వ పంచవర్ష ప్రణాళికాకాలంలో మరమనుషులను, రోటార్ శ్రేణులను, రోటరీ కన్వేయర్లను, సర్దుబాటుకువీలైనవుత్పత్తి పద్ధతులను విస్తరించడం స్వయంచాలనీకరణ విలక్షణతగావుంటుంది; యివి వున్నతవుత్పాదకతకు హామీనిస్తాయి. వుదాహరణకు యీ ఐదుసంవత్సరాల్లో పారిశ్రామిక మరమనుషులసంఖ్య మూడురెట్లు పెంచుతారు.

మనకు కనిపిస్తున్నట్టుగా యీ పరిమాణం చిన్నదేమీకాదు. యీ అధునాతన, యింకాచెప్పాలంటే విలువైనయంత్రపరికరాలను వినియోగించుకోడానికి మౌలికంగా నూతనదృక్పథం అవసరం. కానీ, ప్రస్తుతం వీటిని అనేకమంత్రిత్వశాఖలు చాలా అసమర్థంగా వినియోగించుకుంటున్నాయి. సోవియట్ యూనియన్ ప్రజాఅజమాయిషీ కమిటీ విడుదలచేసిన సమాచారంప్రకారం విద్యుత్-యింజనీరింగ్పరిశ్రమ మంత్రిత్వశాఖ తాలూకు కర్మాగారాల్లో అత్యున్నతవుత్పాదకశక్తిగల ఉద్దియూనిట్లు పూర్తిస్థాయిలో పనిచేయడంలేదు, కొన్నివృథాగాపడివున్నాయి. వ్యవసాయయంత్రాల మంత్రిత్వశాఖకు, విద్యుత్ యింజనీరింగ్ మంత్రిత్వశాఖకుచెందిన అనేకకర్మాగారాదిసంస్థల్లో సంఖ్యా నియంత్రిత మెషీన్‌టూల్స్‌ను రోజుకు ఒకషిఫ్టుకన్నా తక్కువకాలంపాటు వినియోగించుకుంటున్నారు.అలాంటిపనిఅధునాతన సాంకేతికపరిజ్ఞానాల శక్తిసామర్థ్యాలను అప్రతిష్ఠ పాల్జేస్తుంది; ఆర్థికవ్యవస్థకు యెంతోనష్టం కలిగిస్తుంది. యీపరిస్థితిని తక్షణమే సరిదిద్దాలి.

పొదుపైన లోహవుత్పత్తుల, ప్లాస్టిక్, యితరఅధునాతనరకాల పదార్థాలను పెద్దయెత్తున వుపయోగించి సామాజికోత్పత్తిలో పదార్థాల వినియోగాన్ని గణనీయంగా తగ్గించాలనే ఆలోచనవుంది. యీ ఐదేళ్ళకాలంలో సాంప్రదాయికపదార్థాల వుత్పత్తిలోవి కేవలం 6 శాతం పెరుగుదలతోపోలిస్తే యీ పదార్థాల వుత్పత్తిని 30 శాతానికిపైగా పెంచాల్సివుంది. మన శాస్త్రవేత్తలు అభివృద్ధిచేసిన, ప్రస్తుతం వినియోగిస్తున్నవాటికన్నా యెంతోశ్రేష్ఠమైన కొత్తనిర్మాణసంబంధమైన వస్తువుల వినియోగం బ్రహ్మాండమైన అవకాశాలను ఆవిష్కరిస్తుంది. యిది ముఖ్యంగా సంకీర్ణపదార్థాలకు సంబంధించిన విషయం. 12వ పంచవర్ష ప్రణాళికాకాలంలో వాటి వుత్పత్తి 10-12 రెట్లు పెరుగుతుంది.

ఈ పంచవర్షప్రణాళికకోసం వుద్దేశించిన కొత్తయంత్రాల, సాంకేతికపద్ధతుల అభివృద్ధిస్థాయి మొత్తంగా సామాజికశ్రమవుత్పాదకతలో 65 శాతానికిపైగా పెరుగుదలకు హామీకల్పిస్తుంది, పరిశ్రమల్లో వుత్పత్తిఖర్చులను 28 బిలియన్లరూబుళ్ళమేరకు తగ్గిస్తుంది.

శాస్త్రీయభావనలను, అభివృద్ధులను నిరంతరం, అంతకంతకూ యెక్కువగా పునరుద్ధరించాల్సిన అవసరాన్ని శాస్త్ర, సాంకేతికపరిజ్ఞానాల శీఘ్రప్రగతి కల్పిస్తోంది. మౌలికపరిశోధన, మన సోవియట్ యూనియన్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ యీ విషయంలో నిర్ణయాత్మకపాత్రను నిర్వహిస్తాయి. యీ అకాడమీ గొప్పసంప్రదాయాలను నెలకొల్పింది, అసాధారణమైన విజయాలను సాధించింది. కాలేజీ, యూనివర్సిటీల పరిశోధనలు కూడా యెంతోదోహదం చేయగలవు. వాటి ఆవిష్కరణలను సకాలంలో

స్వీకరించి వినియోగించుకుంటే, శాస్త్ర-వుత్పత్తి ఆవృతి అన్నిస్థాయిల్లో సాఫీగా, లయబద్ధంగాసాగితే అవి జాతీయార్థికవ్యవస్థకు ప్రయోజనం చేకూర్చగలవు.

అర్థికవ్యవస్థలోని అన్నిశాఖల్లోచేసిన పరిశోధన యీ గొలుసులోని అత్యంత ప్రధానమైన కొలికి. దీనికి పరిశోధనా యిన్‌స్టిట్యూట్ల, రూపకల్పనా కార్యాలయాల శాఖోపశాఖలవ్యవస్థవుంది. వీటిలో యెందరో పరిశోధకులు పనిచేస్తున్నారు. వీటిని సమర్థంగా వినియోగించుకున్నచోట మంచిఫలితాలు లభిస్తున్నాయి. కానీ, ప్రతిచోటా పరిస్థితియిలాలేదు. తరచుగా శాఖాపరమైనసంస్థలు స్పష్టమైనఫలితాలను సాధించకుండా కాలహరణంచేస్తున్నాయి. కొన్నిసందర్భాల్లో వాటికృషి సంకుచితశాఖాపరమైన ప్రయోజనాలకు లోబడివుంటోంది;వాటికి సృజనాత్మకస్ఫూర్తి కొరవడివుంది; చిన్నచిన్నపథకాలను చేపట్టడమూ, వనరులను, సిబ్బందిని చెల్లాచెదరుచేయడమూ వీటి ప్రత్యేకలక్షణంగావుంది. యీవిషయం తెలిసినప్పటికీఅనేకమంత్రిత్వశాఖల అధిపతులు అపారమైన శాస్త్ర, సాంకేతిక శక్తిస్తోమతలను వినియోగించుకోవడంలో జడత్వాన్ని, బాధ్యతారాహిత్య వైఖరిని ప్రదర్శిస్తున్నారు. పైగా తామే స్వయంగా విజయవంతంగా అభివృద్ధిచేయగలిగినట్టి యంత్రాలను, సాంకేతికపద్ధతులను విదేశాలనుండీ కొనుగోలుచేయడంలో యితరులు ఈర్ష్యపడాల్సినంత చురుకుదనాన్ని కనబరుస్తున్నారు. హానికరమైన యీ పద్ధతిని పార్టీ కచ్చితంగా, సూత్రబద్ధంగా అంచనావేయాలి.

దిగుమతిచేసుకునే సాంకేతికపరిజ్ఞానంకోసం, వుత్పత్తిప్రక్రియలకోసం అనేకమంది మేనేజర్లు వెంపర్లాడడం రూపకల్పనావేత్తలపై హానికరమైన ప్రభావాన్ని నెరపుతుంది. విదేశాలనుండీ యంత్రపరికరాలను దిగుమతిచేసుకోవడం యెంతతేలికో గమనించిన వీరి వుత్సాహం సన్నగిల్లుతుంది; దీక్ష సడలుతుంది, యిబ్బందులకు తలవంచుతారు. దీనర్థం అంతర్జాతీయ శ్రమఫలితాలను వినియోగించుకోకూడదనీ, శాస్త్ర, సాంకేతికపరిజ్ఞానాల ఆదానప్రదానాలను జరుపుకోకూడదనీ యెంతమాత్రమూకాదు; కానీ మనం ప్రధానంగా మన అపారమైన శాస్త్రీయ శక్తిస్తోమతలపై ఆధారపడివుండాలి. కొత్తపంచవర్షప్రణాళికాకాలంలో మనం శాఖాపరమైన శాస్త్రీయపరిశోధనను శక్తివంతంగా పునర్వ్యవస్థీకరించాలి; దాన్ని వుత్పత్తికి సాధ్యమైనంత సన్నిహితంచేయాలి, దాని పాదార్థికపునాదిని, ప్రత్యేకించి మార్గదర్శక కర్మాగార, ప్రాయోగికసదుపాయాలను మెరుగుపర్చాలి.దానికి ఆధునాతనపరికరాలను,పరిశోధనాయంత్రపరికరాలను సమకూర్చాలి. అది తన పరిశ్రమల శాస్త్ర, సాంకేతికస్థాయికి పూర్తిబాధ్యత వహించాలి. దాని పనిని అంచనావేయడానికి ప్రధానమైన గీటురాయిగా వుండాల్సిందిఅదే.

ఫ్యాక్టరీస్థాయిలో శాస్త్రీయపరిశోధనపట్ల ప్రత్యేకశ్రద్ధ వహించాలి. యిది వుత్పత్తికి అన్నిటికన్నా చేరువలోవుంటుంది; వుత్పత్తితో పెనవేసుకునివుంటుంది; యిది నూతన యంత్రాలను అభివృద్ధిపర్చి, తయారుచేయడానికి పట్టేవ్యవధిని గణనీయంగా తగ్గిస్తుం

దనేది అనుభవైకవేద్యమే. ఎలక్ట్రిసీల, ఊరల్‌మష్, ఇవానవ మెషీన్-టూల్‌ప్రొడక్షన్ అసోషియేషన్లకు, యితర అసోసియేషన్లకు లభించిన ఖ్యాతికి మూలకారణం వాటి ఫ్యాక్టరీ శాస్త్రవేత్తలు, రూపకల్పనావేత్తలు , సాంకేతికవేత్తలే. యీ రంగంలో పరిశోధనను అత్యంతశీఘ్రమైనరేట్లలో విస్తరించాలి; దీనితో శాఖాపరమైన పరిశోధనా యిన్‌స్టిట్యూట్లను సాహసోపేతంగా మేళవించాలి. శాస్త్ర, సాంకేతికప్రగతిలో అగ్రభాగాన వుండేందుకు పరిశోధన-వుత్పత్తి అసోసియేషన్ల యేర్పాటును మనం త్వరితంచేయాలి. యీ క్రమం యింజనీరింగ్ పరిశ్రమలో యిదివరకే ప్రారంభమైంది, యితరపరిశ్రమలకు దీన్ని క్రియాశీలంగా విస్తరించాలి.

ప్రధాన పరిశోధనానంస్థల అనుభవం ఆధారంగా అంతర్‌శాఖాపరమైన శాస్త్ర, సాంకేతిక సముదాయాలు యిటీవల ఆవిర్భవిస్తున్నాయి. అవి శాస్త్ర, సాంకేతికప్రగతి శాలూకు ప్రధానమార్గాలనూ, వుత్పత్తితో పరిశోధనను మేళవించే నూతన, సమర్థమైన పద్ధతినీ అన్వేషిస్తున్నాయి.

ఇంజనీర్ల, శాస్త్రజ్ఞుల, రూపకల్పనావేత్తల సృజనాత్మకకృషికి ఆర్థిక, సామాజిక, వ్యవస్థాత్మక పూర్వాపేక్షితాలను నమకూర్చడం ప్రధానవిషయమనడంలో నందేహంలేదు. శాస్త్రీయభావాలను, అభివృద్ధులను జనింపజేసేదివీరే; ముఖ్యంగా వుత్పత్తిసాంకేతికస్థాయి ఆధారపడివుండేది వీరిపైనే. వీరి కార్యకలాపాలను వుద్దీప్తంచేయడానికీ, వీరి సామాజిక ప్రతిష్ఠను పెంచడానికీ, వీరికి మరిన్ని ప్రోత్సాహకాలను సమకూర్చడానికీ అనేకప్రధాన నిర్ణయాలుచేయడం జరిగింది.

చెల్లింపుల నూతనపద్ధతులను ప్రవేశపెట్టాల్సివుంది: యివి అందరినీ ఒకే గాటకట్టే ధోరణిని అధిగమించడంలో, అత్యున్నతస్థాయి సృజనాత్మకఫలితాలను యివ్వగలకృషిని ప్రోత్సహించడంలో తమ సామర్థ్యాన్ని నిరూపించుకున్నాయి. యీ చెల్లింపుల పద్ధతులను ప్రవేశపెట్టాలని అనేకమంది కార్యనిర్వహణాధికారులు పట్టుపట్టిన సందర్భాలున్నాయి. కానీ, యీ నూతన చెల్లింపుపద్ధతులను అమలుజరుపుతున్న కర్మాగారాదినంస్థలు, అసోసియేషన్లు దజనుకన్నా తక్కువ యెందుకున్నాయో కారణాలను వివరించడం కష్టం. శాస్త్ర, సాంకేతికప్రగతివిషయాల్లో మందకొడితనం యెంతబలంగావుందో, యెంత శక్తివంతమైన, భారీస్థాయికార్యాచరణల అవసరముందో పైనపేర్కొన్నదంతా తెలియజేస్తోంది.

ఆర్థికవ్యవస్థలోని అన్నిశాఖల్లో శాస్త్ర, సాంకేతికప్రగతిని త్వరితంచేయడానికి ఆర్థికయంత్రాంగాన్ని మనం పట్టుదలతో పునర్వ్యవస్థీకరించాల్సివుంది. అదేసమయంలో, వున్నతస్థానాల్లోవున్న మేనేజర్ల, ముఖ్యంగా మంత్రులబాధ్యతను పెంచకపోతే యీ యంత్రాంగం దానంతటదే ఫలితాలనివ్వదనేవిషయం మనం గుర్తుంచుకోవాలి. తమతమ పరిశ్రమల్లోని సాంకేతికప్రమాణాలకు వారు పూర్తిబాధ్యతవహించాలి.

శాస్త్ర, సాంకేతికవిధానానికి సంబంధించిన నూతనకర్తవ్యాలను పరిష్కరించడం చాలావరకూ శాస్త్ర, సాంకేతికవిషయాల సోవియట్ యూనియన్ ప్రభుత్వకమిటీపై ఆధారపడివుంది. యీక్రమంలో అది యిప్పటికీ తనస్థానాన్ని సంపాదించుకోలేక పోయింది; మనకాలపు అవసరాలకు సర్దుబాటుకావడంలో విఫలమైంది. అంతర్‌శాఖా పరమైన శాస్త్ర, సాంకేతికసముదాయాలకు ప్రత్యక్ష మార్గదర్శకత్వాన్ని నెరపడంపట్ల, దేశంలో శాస్త్రీయసమాచారాన్ని వ్యవస్థీకరించడంపట్ల శాస్త్ర, సాంకేతికప్రగతికి సంబంధించిన ప్రధానమార్గాలనుసమన్వయంచేయడంపట్ల అది తనశ్రద్ధనుకేంద్రీకరించాలి. 2000వ సంవత్సరంవరకూ స్మియా సభ్యదేశాల శాస్త్ర, సాంకేతికప్రగతి సమగ్రకార్య క్రమాన్ని అమలుజరపడానికి కృషిని సమన్వయపర్చే యెంతోముఖ్యమైన కర్తవ్యంకూడా దానిపై వుంది; యీ కర్తవ్యం దానికి కొత్తది. చివరివిషయం; మన ప్రణాళికలనుండీ, మన మొత్తం ఆర్థికజీవనంనుండీ శాస్త్ర, సాంకేతికప్రగతిని విడదీయరానిఅంశంగాచేయాలంటే, దాని మొత్తం మేనేజిమెంట్‌వ్యవస్థను మౌలికంగా పునర్‌వ్యవస్థీకరించాలి. యిది ప్రణాళికా రచనాపద్ధతికి, ఆర్థికసహాయానికి, ధరలనిర్ణయానికి, ప్రోత్సాహకపద్ధతులకు, మొత్తం ఆర్థికయంత్రాంగానికి వర్తిస్తుంది.

కామ్రేడ్స్, ఒక్కముక్కలోచెప్పాలంటే వుత్పత్తికి శాస్త్ర, సాంకేతికపరిజ్ఞానాలు చేస్తున్నదోహదం క్రమక్రమంగా పెరుగుతున్నదనేవిషయాన్ని దృష్టిలోపెట్టుకుని ప్రతి ఒక్క యింజనీరింగ్, మేనేజీరియల్ నిర్ణయాన్ని పరిశీలించాలనేది 12వపంచవర్ష ప్రణాళిక అగ్రప్రాధాన్యకర్తవ్యం. శాస్త్ర, సాంకేతికవిప్లవం సమకూర్చిన తరగని అవకాశాలను క్రమబద్ధంగా వినియోగించుకునేందుకు సోషలిస్టు ఆర్థికవ్యవస్థ మనకు వీలుకల్పిస్తోంది. తుదివిశ్లేషణలో తేలేదేమంటే, శాస్త్ర, సాంకేతికపరిజ్ఞానం సాధించిన మహత్తర విజయాలు పెట్టుబడిదారీవ్యవస్థలో సామాజికవైరుధ్యాలను విషమింపజేస్తాయి: యిందుకు భిన్నంగా సోషలిస్టు ప్రభుత్వపాలనలో అవి సమాజాన్ని పరివర్తింపచేయడానికి శక్తివంతమైన మీటగావుంటాయి. సోషలిజానికిగల చరిత్రాత్మకఆధిక్యత యిందులోనే వుంది; దీన్ని మనం సంపూర్ణంగా వినియోగించుకోవాలి.

## 2. మదుపువిధానం, పరిశ్రమాదుల నిర్మాణం

పార్టీ ఆర్థికవ్యూహాన్ని అమలుజరపడంలో క్రియాశీలమైన మదుపువిధానం ఫలప్రదమైనసాధనం. ప్రతిఒక్క నిర్దిష్టదశలో, మనదేశం యెదుర్కొనే ప్రధానకర్తవ్యాల పరిష్కారానికి యిది లోబడివుంటుంది. శాస్త్ర, సాంకేతికప్రగతిని త్వరితంచేసే లక్ష్యానికి వున్ముఖత, యీ ప్రాతిపదికపై వుత్పత్తిరంగ పాదార్థికపునాదినీ, నిర్మాణస్వరూపాన్నీ

గుణాత్మకంగా మార్చడం—యిదీ 12 వ పంచవర్ష ప్రణాళికాకాలంలో మదుపువిధాన నూతనలక్షణం.

ప్రస్తుత పంచవర్ష ప్రణాళికాకాలంలో పరిశ్రమలపై పెట్టుబడులమదుపులో పెరుగుదల గణనీయంగా మరింత యెక్కువవుండాలి: 1981-1985 మధ్యకాలంలో 125 బిలియన్ల రూబుళ్లు వున్నది యిప్పుడు 170 బిలియన్ల రూబుళ్ళకు పెరుగుతుంది. పెట్టుబడుల మదుపు యావత్తూ దాదాపు ఒకట్రిలియన్ రూబుళ్లకు చేరుకుంటుంది.

సహజంగానే యిది బ్రహ్మాండమైన పెట్టుబడుల మదుపులకు సంబంధించిన విషయంమాత్రమేకాదు. వనరులను యెంత ఫలప్రదంగా వుపయోగించాం, వాటి శాఖా, పునరుత్పత్తి నిర్మాణస్వరూపం యెలావుంది, అసలు పరిశ్రమాదుల నిర్మాణక్రమాన్నే యెలా వ్యవస్థీకరించాం—అనే విషయాలు చాలవరకూ మదుపువిధాన సార్థకతను నిర్ణయిస్తాయి. మార్గదర్శకసూత్రాలను రూపొందించేటప్పుడు యీ అంశాలనన్నిటినీ కూలంకషంగా వివరించడం జరిగింది.

శాస్త్ర,సాంకేతికప్రగతికి మూర్తీభావమయిన యింజనీరింగ్ సముదాయపరిశ్రమలపై పెట్టుబడులమదుపుల్లో గణనీయమైన పెరుగుదల—80 శాతం—12 వ పంచవర్ష ప్రణాళిక ముఖ్యలక్షణం. యింజనీరింగ్ పారిశ్రామికరంగ సాంకేతికస్థాయిలోనే గుణాత్మకమైన మార్పులకు వీలుకల్పించే దీని శాఖలను అభివృద్ధిచేయడానికి ప్రత్యేకప్రాధాన్యం యిస్తున్నాం. శాస్త్ర, సాంకేతికప్రగతిని త్వరితంచేయడానికి యిది పాదార్థికప్రాతిపదికను నిర్మిస్తుంది.

కీలకరంగాల్లోని యింధనం, శక్తిపారిశ్రామిక సముదాయంపట్ల ప్రత్యేక శ్రద్ధాసక్తులు చూపుతున్నాం. మనదేశానికీ, యితర సోషలిస్టు కుటుంబదేశాలకూ నమ్మకంగా యింధనం సరఫరా హామీనిచ్చేందుకు, యింధనం వెలికితీసేక్రమం, దాని రవాణా అంతకంతకూ క్లిష్టమవుతున్న నేపథ్యంలో చూసినట్టయితే యీ రంగంలోని పరిశ్రమలకు పెట్టుబడుల మదుపులను 47 శాతం పెంచాల్సివుంది. యింధనాన్ని వెలికితీసే, దాన్ని శుద్ధిచేసే ఫలప్రదపద్ధతులను అనుసరించే పరిశ్రమలపై పెట్టుబడుల మదుపు పెరుగుదలరేట్లు యిందుకు దాదాపు రెట్టింపు అవుతాయి.

ఆహార కార్యక్రమానికి అనుగుణంగా, మొత్తంపరిశ్రమాదులపై పెట్టే పెట్టుబడుల్లో మూడింట ఒకవంతును వ్యవసాయ-పారిశ్రామిక సముదాయానికి కేటాయిస్తున్నాం. యిక్కడ, వ్యవసాయక ముడిపదార్థాలను శుద్ధిచేసేరంగాలకు ప్రాధాన్యం లభిస్తుంది: వీటిలోని పరిశ్రమలపై పెట్టుబడుల మదుపుమొత్తం పెరుగుదల 22 శాతంతో పోల్చి చూసినప్పుడు 51 శాతం పెరుగుతుంది. తుదివుత్పాదనల పెరుగుదలకుగల పెద్ద అవరోధాన్ని నిర్మూలించడానికి యిది తోడ్పడుతుంది.

ప్రస్తుతమున్న వుత్పత్తిసదుపాయాల్లోని పాతయంత్రాలస్థానే కొత్తయంత్రాలను ప్రవేశపెట్టడానికీ, యీ సదుపాయాలను ఆధునికీకరించడానికి ప్రాధాన్యంయివ్వడమే యీ నూతన పంచవర్ష ప్రణాళికవిశిష్టలక్షణం. యిందుకోసం మదుపుపెట్టిన పెట్టుబడులవాటా 1985 లో 37 శాతంవుంది, 1990 లో 50 శాతానికి పెరగాల్సివుంది. మరీ కాలంచెల్లిన వుత్పత్తిసదుపాయాలుగలరంగాల్లో, ప్రాంతాల్లో యీ శాతం యింతకంటేకూడా యెక్కువ వుంటుంది.

పరిశ్రమలపై పెట్టే పెట్టుబడుల పునరుత్పత్తిస్వరూపాన్ని సవరించడంవల్ల వుత్పత్తియంత్రాంగ పునర్వ్యవస్థీకరణ గణనీయమైనవేగాన్ని పుంజుకుంటుంది. భౌతికంగా, నైతికంగా కాలంచెల్లిపోయే ధోరణిని యీ యంత్రాంగం యీవిధంగా అధిగమించ గలుగుతుంది. కాలంచెల్లిన యంత్రపరికరాలను నిర్మూలించే క్రమంసగటు వార్షికగుణకం 5-6 శాతంమేరకు అంటే, ఆర్థికవ్యవస్థలో ప్రణాళికాబద్ధ వుత్పత్తిసామర్థ్యానికి హామీ వుండేస్థాయికి పెరగాల్సివుంది. అలాంటి పునర్వ్యవస్థీకరణస్థాయివల్ల ప్రధానమైన యంత్రమరమ్మత్తులకు అయ్యేవ్యయం గణనీయంగా తగ్గగలదు. యీ సమస్యలను పరిష్కరించడానికి యంత్రాల తరుగుదలవిధానంలోకూడా గణనీయమైన మార్పులు చేయాల్సివుందనేవిషయం సుస్పష్టమే.

ఆర్థికవ్యవస్థశాఖలు నూతన ఆర్థికయంత్రాంగానికి మారుతూన్నకొద్దీ, సాంకేతికంగా నూతనమైన పరికరాలను ప్రవేశపెట్టడంలో, పునర్నిర్మాణాల్లో ప్రధానపాత్రను కర్మాగారాదిసంస్థల, అసోసియేషన్ల అభివృద్ధినిధులు నిర్వహిస్తాయి. యీ నిధులు యీ సంస్థల సమిష్టిశ్రామికబృందాలు ఆర్జించినవి. యీ నిధులపట్ల అనుసరించేవైఖరిలో ఒక సమూలమైనమార్పు యిందువల్ల అవసరం. అవసరమైన వనరులన్నిటినీ ముందుగా నూతన సాంకేతికయంత్రాలను అమర్చడానికే అందుబాటులో వుంచుతారనేవిషయం యీ సంస్థల్లో పనిచేసేవారికి పూర్తిగా తెలియాలి. యిక్కడ, ప్రత్యేక బాధ్యత కేంద్ర ఆర్థికసంస్థలపై, సహజంగానే మంత్రిత్వశాఖలపై వుంటుంది. అయితే, యీ సమస్యకు సంబంధించినంతవరకూ యీ సంస్థలూ, మంత్రిత్వశాఖలూ పాతపద్ధతిలోనే పని చేస్తున్నాయి. మహాసభచర్చల్లో పాల్గొన్నవారు యీ సమస్యను లేవనెత్తడం సరియైనదే.

పాతవాటిస్థానే కొత్తయంత్రాలస్థాపనకూ, ఆధునికీకరణకూ ప్రాధాన్యంయివ్వడం వల్ల కొత్తప్రాజెక్టులసంఖ్యవిషయంలో ముఖ్యంగా దేశయూరపియన్‌భాగంలో వీటిపై కొన్నిపరిమితులను విధించాల్సివస్తుంది. ప్రధానమైన, నిర్మాణస్వరూప సంబంధమైన మార్పులు, శాస్త్ర, సాంకేతికవిప్లవ ప్రస్తుతదశలో ఆవిర్భవించిన పరిశ్రమలు, సహజ వనరులను వినియోగంలోకితేవడం—వీటికోసంమాత్రమే కొత్తప్రాజెక్టులను చేపట్టడం జరుగుతుంది. పాతయంత్రాలస్థానే కొత్తయంత్రాలను విస్తృతంగా ప్రవేశపెట్టడం, అత్యవసరమైన నూతననిర్మాణాలనుమాత్రమే చేపట్టడం—యిదీ మన విధానం.

పరిశ్రమాదులనిర్మాణం మరింత సమర్థంగా జరిగేట్టుచూడడానికి దాన్ని పునర్వ్యవస్థీకరించడం మన మదుపువిధాన కీలకాంశం. అనేక అపరిష్కృత సమస్యలు యీ రంగంలో యేళ్ళతరబడిగా పేరుకపోయివున్నాయి. నిర్మాణకాలపరిమితులను ఘోరంగా వుల్లంఘించారు. నిర్మాణప్రాజెక్టుల వ్యయం పెరిగిపోయింది. పూర్తికాని నిర్మాణప్రాజెక్టులశాతం స్థాపించకుండావుండిపోయిన యంత్రాలనిల్వలశాతం అపరిమితంగా పెరిగిపోయింది. పూర్తిగా అసాధారణపరిస్థితి ఒకటి తలెత్తింది; యీ పరిస్థితిలో నిర్మాణసంస్థల అసంతృప్తికరమైనపని, వాటి పారిశ్రామిక సదుపాయాల బలహీనత కొన్నిప్రాంతాల్లో ఆర్థికాభివృద్ధిని పరిమితంచేశాయి; వుత్పాదకశక్తుల హేతుబద్ధపంపిణీకి తీవ్రనష్టం కలిగించాయి. భవననిర్మాణ పరిశ్రమరంగంలోని పరిస్థితిపై, గత కొన్ని సంవత్సరాలుగా కనిపిస్తున్న క్రమశిక్షణ, బాధ్యతాభావాల సార్వత్రిక క్షీణతాప్రభావం పడింది.

ఆర్థికపరమైన, వ్యవస్థాపరమైన చర్యలన్నిటినీ వుపయోగించి పరిశ్రమాదుల నిర్మాణానికి సంబంధించిన సమస్యలన్నిటినీ యెలాంటిజాప్యంలేకుండా పరిష్కరించాల్సి వుంది. యీ పరిశ్రమలోని పరిస్థితిని మెరుగుపర్చేలక్ష్యంతో అనేకనిర్ణయాలను యిటీవలే తీసుకున్నాం. వీటిని బేషరతుగా పరిపూర్తిచేయడంవల్ల సమీపభవిష్యత్తులో అవసరమైన ఫలితాలు లభించాలి. అయితే, పని అంతటితో అయిపోదనేది స్పష్టమే.

అన్నిటికంటేముందు, మనం ఆర్థికవనరులు చెల్లాచెదురుకాకుండా కట్టుదిట్టం చేయాలి. మన మీ విషయాన్నిగురించి చాలాకాలంనుండీ మాట్లాడుతున్నప్పటికీ 300,000 కుపైగా పెద్దా చిన్నా నిర్మాణప్రాజెక్టులు దేశమంతటా నిర్మాణంలోవున్నాయి. బ్రహ్మాండమైన మనదేశ వైశాల్యాన్ని పరిగణనలోకి తీసుకున్నప్పటికీ, యివి అనుమతించరానంత యెక్కువగావున్నాయని చెప్పవచ్చు. పరిస్థితిని చక్కదిద్దాల్సినబాధ్యత సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ మనపై పెట్టింది. 1987 నుండీ ప్రణాళికను రూపొందించడంలో, దాన్ని అమలుజరపడంలో, నిర్మాణప్పని విషయంలో ప్రామాణిక కాలపరిమితులను కచ్చితంగా పాటించాలని సంకల్పించాం.

ఇదంత సులభమేమీకాదు. కొంతమందికి యిది చాలా బాధాకరమనిపించవచ్చు. అతిప్రధానంకాని అనేక ప్రాజెక్టులను అటకెక్కించడం, మానవబలగాన్ని, నిధులను తిరిగి సర్దుబాటుచేయడం అవసరంకావచ్చునేసంగతిని తోసిపుచ్చలేము. అయితే, మనమీచర్య తీసుకోకతప్పదు. మనం నిర్మాణరంగాన్ని కుదించాల్సివుంది. అప్పుడు మాత్రమే నిర్మాణకాలవ్యవధులను మనం కనీసం సగానికి నిజంగా తగ్గించగలుగుతాం. యిప్పటినుండే అన్ని మంత్రిత్వశాఖలూ, డిపార్టుమెంట్లూ, రిపబ్లిక్కులూ యీపనికి సమగ్రసన్నాహాలను చేయాలి.

పంచవర్ష పెట్టుబడులకార్యక్రమం అమలుకు పరిశ్రమాదుల నిర్మాణపనిలో వున్నతమైన పారిశ్రామికీకరణస్థాయి అవసరం. యీపనిని మౌలికంగా నూతన పాదార్థిక, సాంకేతికప్రాతిపదికపై నెలకొల్పాల్సివుంది. 1950 ల ఆఖరులో, 1960 ల ప్రారంభంలోవేసిన పాతప్రాతిపదికకుగల అవకాశాలు పూర్తిగా హరించిపోయాయి. మనదేశంలోని, విదేశాల్లోని తాజా శాస్త్ర, సాంకేతిక విజయాలపై యీ నూతన ప్రాతిపదిక ఆధారపడాలి; యిది ఒక సమగ్రపారిశ్రామిక నిర్మాణపద్ధతిని నెలకొల్పడానికి దోహదంచేయాలి. ముందుగానే తయారయినభాగాలతో నిర్మితమయ్యే ప్రాజెక్టులసంఖ్య పెరగడానికీ, యంత్రవ్యవస్థల బట్వాడాపెరగడానికీ ముసాయిదా మార్గదర్శకసూత్రాలు వీలుకల్పిస్తాయి: అల్యూమినియం, ప్లాస్టిక్కుల, నూతనపదార్థాల వినియోగం 50-100 శాతందాకా పెరగాల్సివుంది. యిదంతా నిర్మాణరంగ వ్యవస్థీకరణను గణనీయంగా మెరుగు పరుస్తుంది; అదేసమయంలో నిర్మాణపుఖర్చులను తగ్గిస్తూ, శ్రమవుత్పాదకతనూ, నిర్మాణ ప్రమాణాలనూ పెంచుతుంది. అయితే యింకా చేయాల్సినదెంతోవుంది. పరిశ్రమల నిర్మాణపనుల పారిశ్రామికీకరణసమస్యను మున్ముందు మళ్ళీమళ్ళీ తడవనున్నాం.

నిర్మాణపరిశ్రమలో రూపకల్పనను మౌలికంగా మెరుగుపర్చడంకూడా యింతే ముఖ్యమైనది. సహజంగానే, యిది చాలావరకూ రూపకల్పనావేత్తలకు సంబంధించిన సమస్య, వుత్పత్తి సాంకేతికస్థాయి, పరిశ్రమలపై పెట్టుబడులను మరింత సమర్థంగా వినియోగించడం, నిర్మాణపని సాంద్రీకరణ—యివి చాలామేరకు వీరిపై ఆధారపడి వుంటాయి. ఆర్థికవ్యవస్థకుచెందిన అన్నిశాఖల్లో శాస్త్ర, సాంకేతికప్రగతికి వీరు వుత్ప్రేరకులుగా వుండాలి.

అత్యధునాతన సాంకేతికప్రక్రియల, సాంకేతికపరిజ్ఞానాలమేరకు రూపకల్పనజరిపి నిర్మించిన నూతన, ఆధునికీకృత కర్మాగారాదిసంస్థల వుదాహరణలు మనకు కోకొల్లలు. మరోవైపు, స్పష్టంగా వెనుకబడిన సాంకేతిక పరిష్కారాలనుపట్టుకుని వేలాడడం తరచూ జరుగుతూంటుంది; ప్రాజెక్టుఖర్చుల అంచనాలో తప్పులు తరచూదొర్లుతుంటాయి. గత పంచవర్షప్రణాళికాకాలంలోని నాలుగుసంవత్సరాల్లో నిర్మాణప్రాజెక్టులకైన ఖర్చు 11 బిలియన్లరూబుళ్లుపెరిగింది; అంటే ప్రారంభపుటంచనాలకన్నా 24 శాతం యెక్కువ పెరిగింది. అంతేగాక, మొత్తంలో సగం ప్రాజెక్టుల ఆర్థిక, సాంకేతికసూచీలు దిగజారి పోయాయి. పరిశ్రమలకు పెట్టుబడులమదుపులను పెంచాలనివచ్చే అనేక విజ్ఞప్తులను నెరవేర్చేమార్గం యిక్కడేవుంది. అనేక సామాజికసమస్యల పరిష్కారానికి అత్యంత శక్తివంతమైన మూలాధారం యిక్కడేవుంది.

యంత్రాలరూపకల్పనలో అసంతృప్తికరపరిస్థితికి బాధ్యత రూపకల్పనా నిపుణులది మాత్రమేకాదు, మంత్రిత్వశాఖలదీ, డిపార్ట్మెంట్లదికూడా. కాలంచెల్లిన రూపకల్పనకు అనుమతిచ్చినదిఅవే. సోవియట్ యూనియన్ నిర్మాణప్రాజెక్టులబ్యాంకు (స్ట్రోయ్

బ్యాంక్) చెప్తున్నదాన్నిబట్టి 12వ పంచవర్ష ప్రణాళికలో కొనసాగించనున్న, శాస్త్ర, సాంకేతికప్రగతి ఆధునికస్థాయికి అనుగుణంగావున్నాయని సంబంధిత మంత్రిత్వశాఖలు పరిగణిస్తున్న ప్రాజెక్టులలో 25 శాతం 10-20 యేళ్ళక్రితం రూపకల్పనచేసినవి. యిది యెంతో ఆందోళనకరమైన విషయం.

ఇలాంటి ప్రాజెక్టులు ఆధునికఅవసరాలకు అనుగుణంగావుండజాలవని గ్రహించ డానికి పెద్దప్రవీణుడుగా వుండాల్సిన అవసరంలేదు. యిలాంటి ఆందోళనకరమైనపరిస్థితి అనేకమంత్రిత్వశాఖల్లో కనిపిస్తుంది. వుదాహరణకు, సోవియట్ యూనియన్ అయసేతర లోహమంత్రిత్వశాఖ 1965-1975 మధ్యకాలంలో 69 ప్రాజెక్టులకువున్నతసాంకేతికస్థాయి వున్నట్లు ధ్రువపర్చింది. మోటారువాహనాలపరిశ్రమమంత్రిత్వశాఖ అలాంటి 20 ప్రాజెక్టులను ధ్రువపర్చింది. యీ నిర్మాణప్రాజెక్టులు రూపకల్పన జరిగినతర్వాత సగటున 20 యేళ్ళకు పనిలోపెట్టారు లేదా అంతకంటేకూడా యెక్కువకాలంపట్టవచ్చు. దీనిపై నేను యింకా యెలాంటి వ్యాఖ్యలైనాచేయడం అవసరమా?

సోవియట్ యూనియన్ ప్రభుత్వనిర్మాణకమిటీ (గస్ట్రోయ్) రూపకల్పనను మెరుగుపర్చడానికి యెంతోకృషిచేయాలి. మంత్రిత్వశాఖల, రూపకల్పనాసంస్థలవిధులను తననెత్తిన వేసుకోకుండానే అది నిర్మాణరంగంలో ఒకేవిధమైన శాస్త్ర, సాంకేతిక విధానాన్ని అనుసరించాలి; రూపకల్పనల ప్రమాణాలను, సాంకేతికస్థాయిని అంచనావేసే పద్ధతిని తయారుచెయ్యాలి; రూపకల్పనలో పోటీలను నిర్వహించాలి.

ఆఖరువిషయం, నిర్మాణరంగ మేనేజిమెంట్‌ను పునర్వ్యవస్థీకరించడం అత్యధిక ప్రాధాన్యంగలకర్తవ్యం. మేనేజిమెంట్, ఆర్థికనిర్వహణపద్ధతుల మెరుగుదలవిషయంలో యిది బహుశా అన్నిటికన్నా యెక్కువవుపేక్షకుగురైనపరిశ్రమ. కానీ, అన్నిరంగాలకన్నా యిక్కడ యీ సమస్య తీవ్రమైనది. నిధులు చెల్లాచెదురుకావడాన్ని, అనేకదొంతరలుగల మేనేజిమెంట్‌ను తొలగించాలి. యూనియన్ రిపబ్లిక్కుల, స్థానికసంస్థల విస్తృతాధి కారాలను, వున్నతబాధ్యతలను కేంద్రీకృతాధికారంతో అత్యంతోపయుక్తంగా మేళవించే పద్ధతిని కనుగొనాలి.

ఈ విధంగా, పరిశ్రమాదుల నిర్మాణాన్ని అన్నిస్థాయిల్లో మెరుగుపర్చాలి. మన ప్రణాళికల సాధ్యాసాధ్యాలు, దేశఆర్థికాభివృద్ధిరేట్లు చాలవరకూ దీనిపై ఆధారపడి వుంటాయని మనం చాలాకచ్చితంగా చెప్పాలి.

## 3. స్వరూపసంబంధ విధానం, ఆర్థిక సముదాయాల అభివృద్ధి

జాతీయార్థికాభివృద్ధిలోని అన్నిదశల్లో మన పార్టీ, స్వరూపసంబంధ విధానానికి, ప్రాధాన్యతల యెంపికకు అంతర్‌శాఖా, శాఖల అంతర్గత సమతూకాలరచనకు ప్రత్యేక ప్రాముఖ్యం యిస్తూవచ్చింది.

జాతీయార్థికవ్యవస్థ నిర్మాణస్వరూపాన్ని మెరుగుపర్చడంలో, దాని శాఖలను అభివృద్ధిపర్చడంలో, అవి చేరుకోవాల్సిన గమ్యాలను నిర్ణయించడంలో అతిముఖ్య లక్ష్యాలను ముసాయిదా మార్గదర్శకసూత్రాలు సమగ్రంగా నిర్వచించాయి. 12 వ పంచవర్ష ప్రణాళికాకాలంలో స్వరూపసంబంధ విధానంలోని అతిముఖ్యమైన మౌలికఅంశాలను మాత్రమే వివరించడానికి నన్ననుమతించండి

మొదటిది; మధ్యంతర వుత్పాదితాలయిన యింధనం, ముడిసరకులు, అర్ధ పారిశ్రామిక వస్తువులకన్నా తుది వుత్పాదితాలయిన యంత్రాల, యంత్రసామగ్రి, వినిమయసరకుల, పూర్తిఅయిన నిర్మాణప్రాజెక్టుల పెరుగుదలకు యెక్కువప్రాధాన్యం వుండాలని యీ విధానం నిర్దేశిస్తోంది. గత పంచవర్షప్రణాళికాకాలంలోకన్నా 1986-1990 లో ప్రతిరూబుల్ ముడి, తదితరపదార్థాలవ్యయం పెరుగుదలలెక్కన, తుది వుత్పాదితాల పెరుగుదలరేటు 40 శాతం యెక్కువవుంటుంది. వస్తూత్పాదక పరిశ్రమల్లో తుది వుత్పాదితాల పెరుగుదలరేటు యింధన, ముడిపదార్థాల పరిశ్రమల్లోని పెరుగుదల రేటుకన్నా నూరు శాతం యెక్కువవుంటుంది. వనరులను ఆదాచేసేవిధానంపై యీ మార్పు చాలవరకూ ఆధారపడివుంటుంది.

మన జాతీయార్థికవ్యవస్థను ప్రపంచంలో అగ్రశ్రేణి శాస్త్ర, సాంకేతికస్థానాలకు తెచ్చే పరిశ్రమల—విద్యుచ్ఛక్తి, రసాయనాల, పెట్రోరసాయనాల, సహజంగానే యింజనీరింగ్ పరిశ్రమల—శీఘ్రతరాభివృద్ధి మరో అంశం. పరిశ్రమలో వాటి వాటా 1990 లోని మొత్తంలో 41 శాతం వుంటుంది.

ఆఖరువిషయం; యెలాంటిమినహాయింపులులేకుండా అన్నిపరిశ్రమలకూ మరింతగా వినిమయసరకులవుత్పత్తిసీ, సేవారంగఅభివృద్ధినీ లక్ష్యంగాచేయటం అతి ముఖ్యాంశం. ఎ గ్రూప్‌పరిశ్రమలసముదాయం అభివృద్ధికన్నా బి గ్రూప్‌పరిశ్రమల సముదాయంఅభివృద్ధికి యెక్కువప్రాధాన్యం యివ్వాలని తలపెట్టాం.

అత్యంతగణనీయమైన స్వరూపసంబంధమార్పులు యింజనీరింగ్‌శాఖకుయిచ్చిన అధికతరప్రాధాన్యంతో ముడిపడివున్నాయి. యీ మార్గదర్శకసూత్రాలను తయారు చేస్తున్నపుడు, యింజనీరింగ్ అగ్రేసరపాత్రను తక్కువఅంచనావేయరాదని పార్టీ కేంద్ర కమిటీ హెచ్చరించింది; దాని పెరుగుదలరేట్లను మొత్తం పారిశ్రామికరంగ పెరుగుదల రేటుకు దగ్గరగాతెచ్చే మునుపటి ధోరణిని అధిగమించడం అవసరమని స్పష్టంచేసింది. 12 వ పంచవర్ష ప్రణాళికలో యీ శాఖ పెరుగుదలరేటు మొత్తం పారిశ్రామికరంగం పెరుగుదలరేటుకన్నా 90 శాతం యెక్కువగావుంటుంది. యిది చాలాగణనీయమైన గుణకం. యిది జాతీయార్థికవ్యవస్థలో యింజనీరింగ్ ప్రాధాన్యతాస్థానాన్ని పటిష్టంచేస్తుంది.

ఉత్పత్తి నిర్మాణస్వరూపాన్ని మార్చడం, యంత్రాల, యంత్రసామగ్రి నాణ్యతకు నిర్దేశించిన సూచీలను పెంచడం యంత్రనిర్మాతల అతిముఖ్యకర్తవ్యం. యింజనీరింగ్

వుత్పత్తుల్లో యేటా పాతవాటిస్థానే ప్రవేశపెట్టే కొత్తవి 1985 లో 4.5 శాతంవుండగా, 1990 లో వాటిని 13 శాతానికి పెంచాల్సివుంది. యింజనీరింగ్‌శాఖ పెరుగుదలకు అధికతర ప్రాధాన్యమిస్తున్న నేపథ్యంలో యిది మనదేశ వుత్పాదకసదుపాయాలకు ఆధునిక ప్రాతిపదికపై కొత్తయంత్రాలను అమర్చేందుకు నిజమైనపునాదిని సమకూర్చగలదు.

ఇంజనీరింగ్ పరిశ్రమ ఆధునికీకరణపట్ల ప్రత్యేకశ్రద్ధ వహిస్తున్నాం. దాని సాంకేతికస్థాయి ప్రధానంగా యంత్రపరికరాలు, సాధనాలు, యెలెక్ట్రానిక్స్, విద్యుత్ యింజనీరింగ్‌శాఖలు అందుకునే స్థాయిలపై ఆధారపడివుంటుంది. అందువల్ల యివి మొత్తం యింజనీరింగ్ పరిశ్రమకన్నా యెక్కువవేగంగా అభివృద్ధిచెందాల్సి వుంటుంది. అదేసమయంలో, ప్రతిఒక్క యంత్రనిర్మాణ మంత్రిత్వశాఖ తన పరిశ్రమ ప్రత్యేక అవసరాలకు అనుగుణమైన యంత్రపరికరాల వుత్పత్తిని పెంపొందించుకోవాలి.

యంత్రనిర్మాణానికి నిర్ణయించినలక్ష్యాలదృష్ట్యా యీ జటిలశాఖల్లో మెరుగుపర్చిన మేనేజిమెంట్ అవసరం. సోవియట్ యూనియన్ మంత్రిమండలి ఆధ్వర్యాన ఒక యింజనీరింగ్ బ్యురో యేర్పాటైంది. అది తనపనిని అతి శీఘ్రగతిన సాగిస్తోంది.

చట్రపువస్తువుల కర్మాగారసముదాయంలో గణనీయమైన మార్పులను తలపెట్టాం. ఆధునికమైన, పొదుపైనరకాల వస్తువులవాటాను పెంచడం యిక్కడ ప్రధానవిషయం. యీ కారణంగా చట్రపువస్తువులవిషయంలో పెరుగుతున్న జాతీయార్థిక అవసరాలను గణనీయంగా తక్కువగావున్న వుత్పత్తిపెరుగుదలరేట్లే తీర్చగలవు. యిది దేశవనరులను ఆదాచేయడానికి యీ కర్మాగారసముదాయంచేసే ముఖ్య దోహదమౌతుంది.

ఉదాహరణకు, ఇనుము, ఉక్కుపరిశ్రమలో భారీస్థాయిలో కొత్తయంత్రాలను అమర్చడంవల్ల లోహవుత్పత్తులస్వరూపమూ, నాణ్యమూ మెరుగౌతాయి. ఫలితంగా, పూర్తిగా తయారయిన రేకులు, బద్దీలవుత్పత్తి 9 శాతం పెరుగుదలతోనే యీ పంచవర్ష ప్రణాళికలో మొత్తం పారిశ్రామికవుత్పత్తి 21-24 శాతం పెరుగుతుంది. యింజనీరింగ్, లోహకార పరిశ్రమల్లో పెరుగుదల 40-45 శాతంవరకూవుంటుంది. అదేసమయంలో మనం లోహాలు, ముఖ్యంగా యింజనీరింగ్ నిర్మాణశాఖల్లో లోహాలు మరింత హేతుబద్ధంగా వినియోగమయ్యేట్టు చూడాలి.

ఆయసేతర లోహాలపరిశ్రమలో వనరుల సమగ్రవినియోగానికీ, కొత్తరకం సరకుల వుత్పత్తిపెరుగుదలకూ ప్రాధాన్యమిస్తున్నాం. లోహాలు, తదితర సాంప్రదాయిక పదార్థాలస్థానంలో రసాయనికపదార్థాలను ప్రవేశపెట్టడం మరింత శీఘ్రగతిన సాగుతుంది. ప్లాస్టిక్కులలో అత్యధునాతనరకాల వుత్పత్తి ఆరురెట్లు పెరగాల్సివుంది. అధునాతన కలపసామగ్రి వుత్పత్తిపెంపుదలకుకూడా ప్రాధాన్యంవుంటుంది.

ఈ సంస్థల సముదాయ అభివృద్ధిలో అంతగానూ ముఖ్యమైన అంశం వెలికితీసిన ముడిపదార్థాలకూ, పూర్తిగా తయారైనసరకులకూమధ్య నిష్పత్తిని మెరుగుపర్చడం.

వుదాహరణకు, కాకిరాయితవ్వకాన్నీ, లేదా దుక్కఇనుము, కోక్‌వుత్పత్తినీ యేమాత్రమూ పెంచకుండానే, ఉక్కురేకుల, బద్దీలవుత్పత్తి పెరగాల్సివుంది. బయటికి తరలించిన ప్రతిఒక్క ఘనపుమీటర్ కలపకు తయారయ్యే కర్రసామగ్రి 16 శాతంమేరకు పెరగాల్సి వుంది. యిదంతా యీ పరిశ్రమల సాంకేతికస్థాయిని పెంచడంద్వారా సాధించాల్సి వుంది.

యావత్తు జాతీయార్థికవ్యవస్థ నమ్మకంగా అభివృద్ధిచెందాలంటే, యింధన, శక్తి సంస్థలసముదాయం మరింత మెరుగుపడాలి. యింధన-శక్తి సమతూకపుస్వరూపంలో ప్రధానమైన మార్పులను సోవియట్ యూనియన్ శక్తికార్యక్రమాన్ని అనుసరించి చేయాల్సివుంది. యీ పంచవర్షప్రణాళికాకాలం ముగిసేనాటికి అణువిద్యుత్కేంద్రాలు మొత్తం విద్యుదుత్పాదనలోని తమవాటాను దాదాపు రెట్టింపుచేస్తాయి. వుత్పత్తిఅయ్యే మొత్తం విద్యుచ్ఛక్తిలో వాటివాటా 20 శాతానికిపైగా వుంటుంది.

11వ పంచవర్షప్రణాళికాకాలంలో సోవియట్ యూనియన్ విద్యుచ్ఛక్తిపరిశ్రమ మంత్రిత్వశాఖ కొత్త అణువిద్యుత్ కర్మాగారాలస్థాపనలో తనకు నిర్ణయించినలక్ష్యాలను అందుకోలేదు. యిందువల్ల, శిలాజయింధనాలు అదనంగా అవసరమయ్యాయి. మన దేశంలో యింధన సమతూకంలోని ఒత్తిడినీ, అణువిద్యుదుత్పత్తిపాత్ర పెరుగుతూన్న స్థితినీ దృష్టిలోవుంచుకుంటే, యీవిధమైన వైఫల్యాలు భవిష్యత్తులో యేత్రమూ అనుమతించరానివి.

ఇంధన, శక్తి మొత్తంవనరుల్లో సహజవాయువు వాటా 38 శాతం పెరగాల్సి వుంది. సహజవాయుపరిశ్రమ తనకు నిర్దేశించినకర్తవ్యాలను బాగా నిర్వహించడంలేదని చెప్పజాలం. అయితే, ఆత్మసంతృప్తికి ఆస్కారంలేదు. ఉరన్‌గోయ్ నిక్షేపం తన నిర్ణీత వుత్పత్తిస్తోమతకు చేరుకున్నతర్వాత సహజవాయువు వెలికితీతలో పెరుగుదల ప్రధానంగా యామ్‌బర్గ్ నిక్షేపంనుండీలభిస్తుంది. అక్కడ తగుసదుపాయాల నిర్మాణాన్ని త్వరితంచేయడం నేటి ప్రధానవిషయం. భవిష్యత్తులో వుపయోగించుకోవడంకోసం తగినన్ని వనరులనుకూడా సిద్ధంగా వుంచుకోవాలి.

చమురును వెలికితీయడంలో పరిస్థితులను ప్రత్యేకించి పశ్చిమసైబీరియాలో గణనీయంగా మెరుగుపర్చాల్సిన అవసరముంది. యీ పంచవర్షప్రణాళికాకాలం ముగిసే నాటికి సోవియట్ యూనియన్ మొత్తం చమురువుత్పత్తిలో మూడింట రెండువంతులు యీ నిక్షేపంనుండే లభించాలి. యీ పరిశ్రమ అస్తవ్యస్తమైన పనితీరువల్ల ఆర్థికవ్యవస్థకు యిబ్బందులుకలిగాయి. ప్రధానమైన నిక్షేపాల్లోని చమురుబావుల వుత్పాదకత పడిపోవడం ప్రారంభమైనప్పుడు చమురుపరిశ్రమ మంత్రిత్వశాఖ, త్యూమెన్ ప్రధాన చమురు, గ్యాస్ పరిపాలకసంస్థ, దాని కర్మాగారాదిసంస్థలు పనిచేయడానికి తయారుగాలేవని తేలిపోయింది. పనిలో ప్రస్తుతమున్న వెనుకబాటుతనాన్ని సాధ్యమైనంత తక్కువకాలంలో అధిగ మించాలి. పార్టీ, ప్రభుత్వమూ చమురుకార్మికులకు గణనీయమైన సహాయాన్నిచేసింది.

మంత్రిత్వశాఖ వ్యవస్థీకరణకృషి, యీ మార్గదర్శకసూత్రాల్లో నిర్దేశించిన కర్తవ్యాలను బేషరతుగా నెరవేర్చడానికీ, యిందుకోసం సమిష్టి శ్రామికబృందాలకృషిని సమీకరించడానికి దాని ఆతురత—వీటిపై యిప్పుడు విజయం ఆధారపడివుంది. ప్రణాళిక నిర్దేశించినంతచమురు చేతికందేట్టుచూడడంలో స్థానికపార్టీసంస్థలు, ఆర్థికసంస్థలు పెద్దపాత్ర వహించాల్సివుంది.

బొగ్గుపరిశ్రమ, ఓపెన్‌కాస్ట్ గనులతవ్వకంపట్ల, ముఖ్యంగా తూర్పుమండలాల్లో ప్రత్యేక శ్రద్ధానక్తులు చూపుతున్నాం. బొగ్గుతవ్వకంచాలాకాలంగాసాగుతున్న ప్రాంతాల్లోవి గనుల్లో పాతయంత్రాలస్థానే కొత్తవాటిని ప్రవేశపెట్టి, వాటిని ఆధునికీకరించడం ముఖ్యంగా దనేృత్స్క్, కుజ్నేత్స్క్ మండలాల్లో కూడా కొనసాగించాల్సివుంది.

ముఖ్యంగా చమురు, సహజవాయువు, ఖనిజాలకోసం పెద్దయెత్తున భూగర్భసర్వే జరపడం, కనుగొన్న ఖనిజనిక్షేపాలను వెలికితీయడానికిజరిగే సన్నాహాల్లో వున్నతస్థాయి సామర్థ్యం, నాణ్యత—యివి ఆర్థికవ్యవస్థ శక్తివంతంగా అభివృద్ధిచెందడానికి అవసరం.

నానాటికి సోవియట్‌ప్రజల పెరుగుతూన్న బహువిధ అవసరాలను మరింత పూర్తిగా తీర్చేందుకు యెక్కువ ప్రాధాన్యమివ్వడం స్వరూపసంబంధమైన పునర్వ్యవస్థీకరణలోని అతిప్రధానమైన ధోరణి. ఆహారపదార్థాల శుద్ధిపరిశ్రమలను, వినిమయసరకుల పరిశ్రమలను శీఘ్రగతిన అభివృద్ధిపర్చడంద్వారా దీన్ని సాధిస్తున్నారు.

12వ పంచవర్షప్రణాళికాకాలంలో వ్యవసాయ-పారిశ్రామిక సముదాయంలోని శాఖల్లో సన్నిహితమైన, మెరుగైన సమన్వయాకృత సహకారాన్ని సాధించనున్నాం. యిది మొత్తం పనితీరును మెరుగుపరుస్తుంది. వ్యవసాయరంగం గణనీయంగా అభివృద్ధి చెందుతుంది; దాని పాదార్థిక, సాంకేతికపునాది పటిష్టమౌతుంది. కలుపుమొక్కలను నాశనంచేసే, తెగుళ్ళనుండీ కాపాడే రసాయనాలను, నూతనయంత్రాలను, ఖనిజయెరువులను సమిష్టి, ప్రభుత్వక్షేత్రాలకు విరివిగా సరఫరాచేయడంవల్ల, కొత్తభూములను బాగుచేయడం వల్ల, యీ వనరులన్నిటినీ ఫలప్రదంగా వుపయోగించడంవల్ల అన్నిరకాల వ్యవసాయోత్పత్తులు పెరుగుతాయి. ధాన్యోత్పత్తిని 250-255 మిలియన్ల టన్నులకు, మాంసోత్పత్తిని 21 మిలియన్లటన్నులకు పెంచాలని తలపెట్టాం. సాంద్రపద్ధతులను వుపయోగించడం ద్వారా, ధాన్యం దిగుబడులను, పశుగణ వుత్పాదకతను పెంచడంద్వారా, వ్యవసాయ-పారిశ్రామిక సముదాయంలో ఆర్థికమేనేజిమెంట్‌కు నూతనపద్ధతులను అవలంబించడం ద్వారామాత్రమే యిలాంటి సత్ఫలితాలను సాధించగలం. ఆహారపదార్థాలను శుద్ధిచేసే పరిశ్రమల, రవాణా సౌకర్యాల, వ్యవసాయోత్పత్తులను నిల్వచేసేసదుపాయాలఅభివృద్ధికి ప్రాధాన్యం యివ్వడం వచ్చేఐదేళ్ళకు ప్రముఖలక్షణం కాగలదు. యిదంతా అనవసరమైన పెట్టుబడులను, నష్టాలను తగ్గిస్తుంది; వనరుల అందుబాటును విస్తృతంచేస్తుంది; ఆహారపదార్థాల నాణ్యతను మెరుగుపరుస్తుంది.

వాడకం సరకులవుత్పత్తి, సేవలవిస్తరణకు సంబంధించిన సమగ్రకార్యక్రమాన్ని అనుసరించి వాడకంసరకుల వుత్పత్తిలక్ష్యాలను నిర్దేశించడం జరిగింది: యిది వాటి అభివృద్ధి,మెరుగుదలకు విస్తారఅవకాశాలను కల్పిస్తుంది. కర్తవ్యం యేమంటే శీఘ్రతర సాంకేతికాభివృద్ధినీ, తేలికరకం, స్థానికపరిశ్రమల, సేవల, వ్యాపారవిస్తరణనూ అమలు జరపడం. వచ్చేఐదేళ్ళలో వాడకంసరకుల తయారీని (ఆహారపదార్థాలుతప్ప) 30 శాతం పెంచాలని, అంటే వీటివిషయంలో మొత్తం పారిశ్రామికోత్పత్తిలోకంటే యెక్కువ పెరుగుదలరేటు వుండేట్టుచూడాలని తలపెట్టాం. సరకుల వైవిధ్యాన్ని గణనీయంగా విస్తరించడం, వాటి నాణ్యతను మెరుగుపర్చడం జరుగుతుంది.

యావత్తు ఆధారరంగం, అంటే రవాణా, కమ్యూనికేషన్లు, సమాచారవ్యవస్థ, పాదార్థిక, సాంకేతికసరఫరాలు, గిడ్డంగులు, రోడ్లు—వీటి సమగ్రమైన, సుసమన్వీకృత అభివృద్ధి మన ఆర్థికవ్యవస్థకెంతో ముఖ్యమైనది. వీటి ప్రాధాన్యత అంతకంతకూ యెక్కువగా పెరుగుతోంది.

అంతకంతకూ పెరుగుతూన్న సరకులరవాణాను, ప్రయాణీకులరవాణాను, ముఖ్యంగా మనదేశంలోని యూరపియన్‌భాగానికీ, తూర్పుప్రాంతానికీమధ్య జరిగే యీ రవాణాను నిర్వహించాల్సినకర్తవ్యాన్ని రవాణాకార్మికులు యెదుర్కొంటున్నారు. దీన్ని జయప్రదంగా నిర్వహించేందుకు అన్నిరకాల రవాణాసదుపాయాల నిర్వహణను బాగా సమన్వయీకరించడం, కొత్తరకాల రవాణాసాధనాలను అభివృద్ధిపర్చడం, రవాణాసేవల పాదార్థిక,సాంకేతికప్రాతిపదికలను యితోధికంగా పటిష్టంచేయడం అవసరం. ప్రాంతీయ పరిపాలకకేంద్రాలలో సమిష్టివ్యవసాయక్షేత్రాల, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల కేంద్రాల వన్నిటినీ మోటారురోడ్లతో కలపడమనేది బ్రహ్మాండమైన పారిశ్రామిక, సామాజిక ప్రాధాన్యంగల కర్తవ్యం.

జాతీయార్థిక సముదాయపరిధిలో ప్రాదేశికంగా సామాజికశ్రమ విభజనపట్ల విజ్ఞతాయుత, హేతుబద్ధదృష్టితో అన్ని యూనియన్ రిపబ్లిక్కులను, ప్రధానమైన మండలాలను అభివృద్ధిపర్చడానికి చర్యలను రూపొందించడంజరిగింది. అన్ని రిపబ్లిక్కుల ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధిని పెంపొందించి, వుత్పాదకశక్తులకు మరింత సరైన స్థలనిర్ణయంజరగడానికి హామీనిచ్చేవిధంగా ముసాయిదా మార్గదర్శకసూత్రాల్లో లక్ష్యాలను నిర్దేశించాం. దేశ ఆర్థికస్తోమతను పెంపొందించడానికి ప్రతిఒక్క రిపబ్లిక్కూ యెంతో దోహదంచేయాల్సివుంది.

పారిశ్రామికసంస్థల స్థలనిర్ణయానికీ, అందుబాటులోవున్న మానవబలగాలు పాదార్థికవనరులకూమధ్య సన్నిహితసంబంధంకల్పించడం యెంతోముఖ్యమైన ప్రాదేశిక సమస్యల్లో ఒకటి. అనేకరకాల వనరులు దేశభూభాగమంతటా అసమంగా వంపిణీ అయివున్నాయనేది తెలిసిందే. యింధనం, ముడిపదార్థాల వుత్పత్తి వైఖరియాలో

ప్రధానంగా అభివృద్ధిచెందుతుండగా, వుత్పాదక ఆస్తుల్లో అధికభాగం సోవియట్ యూనియన్‌లోని యూరపియన్‌ప్రాంతంలో కేంద్రీకృతమయ్యాయి. అదేసమయంలో, శ్రామికబలగాల పెరుగుదలరేటు మధ్యాసియా, ట్రాన్స్‌కకేషియాప్రాంతాల్లో అత్యధికంగా వుంది. శక్తియెక్కువగా అవసరమయ్యే పారిశ్రామిక సదుపాయాలను యింధనం, శక్తి వుత్పత్తయ్యేచోట్ల స్థాపించడానికి, అవసరమైనన్ని మానవబలగాలు లభించే మండలాల్లో పనిప్రదేశాల సంఖ్యను పెంచడానికి మునాయిదామార్గదర్శకసూత్రాలు వీలుకల్పిస్తున్నాయి. సైబీరియా, సోవియట్ దూరప్రాచ్యప్రాంతాల ఆర్థికాభివృద్ధిని యేకీకృతంచేయడం, ఆ ప్రాంతాల ప్రకృతిసంపదను వినియోగంలోకి తీసుకరావడం, ఆ ప్రాంతాలతో రవాణా సంబంధాలు నెలకొనేట్టుచూడడం—వీటిపట్ల మార్గదర్శకసూత్రాలు ప్రత్యేకశ్రద్ధానక్తులను చూపిస్తున్నాయి.

సాంద్రీకరణ, శాస్త్ర, సాంకేతికప్రగతి 12వ పంచవర్షప్రణాళిక నిర్దేశిస్తున్న స్వరూపసంబంధ విధానంలోని కీలకాంశాలు. జాతీయార్థికవ్యవస్థకు గట్టి పాదార్థిక, సాంకేతికప్రాతిపదికవుండేట్టు యీ విధానం హామీనిస్తోంది.

## 4. అజమాయిషీవ్యవస్థను, మేనేజిమెంట్ పద్ధతులను మెరుగుపర్చడం

కామ్రేడ్స్, మన పథకాల, లక్ష్యాలవిజయం అజమాయిషీ, మేనేజిమెంట్‌పద్ధతుల మెరుగుదలతో అవిభాజ్యంగా ముడివడివుంది. మునుపటిపద్ధతులను, పాతవ్యవస్థాత్మక రూపాలను సమూలంగామార్చకుండా మనం వుత్పత్తిని ఆర్థికాభివృద్ధిలో యేర్పడిన నూతనపరిస్థితులకు, అధునాతన అవసరాలకు తగినట్టుగా సర్వతోముఖ సాంద్రీకరణ మార్గంలోపెట్టలేం. యిక్కడ మనకుకావాల్సింది పాక్షికమెరుగుదలలుకాదు, మిహాయిల్ గొర్బచేవ్ రాజకీయనివేదికలో చెప్పినట్టుగా మౌలికసంస్కరణకావాలి.

ముక్కుసూటిగాచెప్పాలంటే, అజమాయిషీవ్యవస్థను మెరుగుపర్చాల్సిన నిరంతరావశ్యకతను యిటీవలివరకూ అన్నివిధాలా తక్కువగా అంచనావేశారు. యీ పనిని చాలానెమ్మదిగా, అరకొరగాచేశారు. పాతదానిపట్ల వల్లమాలిన అభిమానం, ప్రధానంగా పాతపరిపాలనాపద్ధతులు పైచెయ్యి సాధిస్తూవుండినాయి, యివి ఆర్థికాభివృద్ధికి అవరోధంగాపనిచేశాయి. మేధామాంద్యం తప్పనిసరిగా చేతల్లో మాంద్యాన్ని తెచ్చిపెట్టింది.

పార్టీ తగినవిర్ధారణలుచేసి, స్పష్టమైనలక్ష్యాన్ని నిర్దేశించింది: అది మొత్తం అజమాయిషీవ్యవస్థను మెరుగుపర్చేందుకు భారీస్థాయిచర్యలను అమలుజరపడం: యీ చర్యల లక్ష్యం యీ వ్యవస్థ సామర్థ్యాన్ని గణనీయంగాపెంచేందుకు, శాస్త్ర, సాంకేతిక ప్రగతిని మౌలికంగా త్వరితంచేయడంపై, మానవాంశాన్ని సర్వతోముఖంగా వుద్దీప్తం

చేయడంపై యీ వ్యవస్థను కేంద్రీకరించేందుకు వుద్దేశించినది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 27వ మహాసభకు సమర్పించిన సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ రాజకీయనివేదికలో యీ లక్ష్యాన్నిక్షుణ్ణంగా, ప్రగాఢంగా విశదీకరించడం జరిగింది; యీ నివేదిక మన కార్యాచరణల ప్రాథమికపంథాను నిర్వచించింది. కేంద్రీకృత ప్రజాస్వామ్యం అనే తిరుగులేని సూత్రంపై ఆధారపడుతూ మనం యీ పంథాను అనుసరించాలి; ఆర్థికవ్యవస్థకు పథకబద్ధమైన కేంద్రీకృతమార్గదర్శకత్వాన్ని అంటే సోషలిజం సాధించిన గొప్పవిజయాన్ని, మౌలికమైన ఆధిక్యతను పటిష్ఠంచేయడం, మెరుగుపర్చడం కొనసాగించాలి. యీ విషయంలోకూడా యీ ప్రాథమిక సూత్రంనుండీ వైదొలగుతామనే బూర్జువా సిద్ధాంతవేత్తల ఆశలను మనం "వమ్ముచేశాం" యికముందు కూడా వమ్ము చేస్తామనేది స్పష్టమే. అదేసమయంలో, తుదిఫలితాల విషయంలో అసోసియేషన్ల, కర్మాగారాదిసంస్థలబాధ్యతను పెంచుతూ, పార్టీ పట్టుదలతో వాటి స్వేచ్ఛా పరిధిని విస్తరిస్తుంది; వుత్పత్తిఖర్చుల లెక్కలురాయడాన్ని ప్రగాఢంచేస్తుంది. మన ఆర్థికవ్యవస్థకుగల విస్తారపరిధీ, అంతర్‌శాఖా, ప్రాంతీయసంబంధాల్లోని సంకీర్ణస్వభావం —యివి శాఖా, ప్రాదేశిక అజమాయిషీల అభిలషణీయ మేళవింపును, వ్యవస్థాత్మక స్వరూపాల మెరుగుదలను సాధించాల్సిన ఆవశ్యకతను నిర్దేశిస్తున్నాయి.

ఇటీవలికాలంలో యీ విషయంలో ముఖ్యమైనచర్యలు తీసుకున్నవిషయం మనకు తెలుసు. అత్యంతసమర్థమైనఅజమాయిషీపద్ధతులకోసం మునుపెన్నడూలేనంత విస్తృతంగా అన్వేషించడం, వీటికోసం ప్రాయోగికవిశదీకరణ, దీనికితోడు తమ సామర్థ్యాన్ని నిరూపించుకున్న నూతనకల్పనలను ప్రవేశపెట్టడం—యిది మన ఆర్థికజీవనానికి విలక్షణమైంది. పాదార్థికసంపదను సృష్టిస్తున్న, అజమాయిషీవర్గాలన్నీ పరస్పరం పెనవేసుక పోయినస్థాయిలో, అంటే కర్మాగారాదిసంస్థల, అసోసియేషన్లస్థాయిలో హక్కుల,బాధ్యతల విస్తరణతో మనం కృషినిప్రారంభించాం. యిక్కడ ఆర్థికయంత్రాంగలోపాలు ప్రత్యేకించి స్పష్టంగాకనిపించాయి. సమిష్టి శ్రామికబృందాల ప్రయోజనాలకు, వాటికృషి తుదిఫలితాలకుమధ్య సన్నిహితసమన్వయం లేకపోవడం వాటి చొరవను, నూతన కల్పనల పట్ల వాటి ఆసక్తినినిరోధించింది; వుత్పత్తిలో వినియోగించకుండావున్న శక్తిస్రోతలను వుపయోగించుకునేందుకు వాటిని పురికొల్పలేకపోయింది. గతపొరపాట్లు మళ్ళీ జరక్కుండా చూసేందుకు ఆయా ఆర్థికశాఖల ప్రత్యేకతలను పరిగణనలోకితీసుకుని నూతనపద్ధతులను రూపొందించడానికి కృషిజరుగుతోంది. యిదంతా యీ నూతనపద్ధతుల బలమైన, బలహీనమైనపార్శ్వాలను మరింత విశ్వసనీయంగా నిర్ణయించడానికీ, వాటిని నిర్దుష్టం చేయడానికీ, వాటిని వర్తింపజేసేరంగాన్ని దశలవారీగా విస్తరించడానికీ మనకు వీలుకల్పిస్తుంది.

12వ పంచవర్షప్రణాళికాకాలంలో మనం అఖండ అజమాయిషీవ్యవస్థను అభివృద్ధి

చేయడంలో పట్టుదలను కనబర్చాల్సివుంది; ఆర్థికయంత్రాంగంలోని మౌలికాంశాలను నిరంతరం సర్దుబాటుచేయాలి; ప్రణాళికారచనకు, వుత్పత్తిప్రేరణకు, వ్యవస్థీకరణకు సంబంధించి మరింత సమర్థమైనరూపాలనూ, పద్ధతులనూ అన్వేషించాలి.

ఆర్థికవ్యవస్థలోని అన్నిశాఖల్లో నూతన మేనేజిమెంట్‌పద్ధతులను ప్రవేశపెట్టడం యీ ఐదేళ్ళకాలంలో నెరవేర్చాల్సిన అత్యంతముఖ్యమైన కర్తవ్యాల్లో ఒకటి. పారిశ్రామికోత్పత్తిలో సగంమేరకు వుత్పత్తిచేస్తున్న కర్మాగారాదిసంస్థలు, మొత్తం కమ్యూనికేషన్ల వ్యవస్థ, సేవాపరిశ్రమలు, కొన్ని రవాణాసంస్థలు ప్రస్తుతం నూతనపద్ధతుల్లో పని చేస్తున్నాయి. 1987 నాటికి పారిశ్రామిక, రవాణాసంస్థలన్నీ యీ సూత్రాల ప్రాతిపదికపై పనిచేస్తాయి. అదేసమయంలో, సాధ్యమైనంత తక్కువవ్యవధిలో మనం వ్యవసాయ-పారిశ్రామికసముదాయ పునర్వ్యవస్థీకరణను పూర్తిచేయాలి; దాన్ని నడపడానికి మరింత సమర్థమైనపద్ధతులకు పునాదివేయాలి; సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లో, కర్మాగారాదిసంస్థల్లో, అసోసియేషన్లలో సిసలైన వుత్పత్తిఖర్చులనురాసే సంబంధాలను విస్తృతంగా ప్రవేశపెట్టేందుకుకూడా పునాదివేయాలి.

ఇదివరకేచెప్పినట్టుగా భవననిర్మాణ పరిశ్రమశాఖలకు మేనేజిమెంట్‌ను తక్షణమే మెరుగుపర్చాల్సిన అవసరముంది. యిందులో మనం యీ యేడాదే ప్రణాళికారచన నూతనపద్ధతులను, ఆర్థికయంత్రాంగంలోని మౌలికాంశాలను ప్రాయోగికంగా సరినిరూపణ చేసేపనిని ప్రారంభించాల్సివుంది; తర్వాత దీన్నిమొత్తం పరిశ్రమలకు విస్తరింపజేసేందుకు యీపని ప్రారంభించడం అవసరం. దేశం యెదుర్కొంటున్న కర్తవ్యాలను దృష్టిలో పెట్టుకుని పరిశ్రమలనిర్మాణం శాఖకు మేనేజిమెంట్‌వ్యవస్థకు సంబంధించిన సమస్యలన్నిట్నీ క్షుణ్ణంగా పరిశీలించాల్సిన అవసరముంది.

మన ఆర్థిక యంత్రాంగాన్ని మరింత మెరుగుపర్చదలచుకుంటే, దాని మౌలికాంశాలన్నిట్నీ విశదీకరించదలచుకుంటే వుత్పత్తిఖర్చుల లెక్కలురాసేపద్ధతిని ప్రగాఢం చేయడం ప్రత్యేకించిముఖ్యం. కర్మాగారాదిసంస్థలు, అసోసియేషన్లు సాధించే తుది ఫలితాలకూ, వుత్పత్తి అభివృద్ధికి, సిబ్బందివేతనాల చెల్లింపులకు, పాదార్థిక ప్రోత్సాహకాలకు, వారి సామాజిక అవసరాలనుతీర్చడానికి అవి కేటాయించేనిధులకూమధ్య ఒక సన్నిహితమైన, సడలించవీలులేనిసంబంధాన్ని నెలకొల్పాలి. అసలు విషయమేమంటే యీ నిధులు నానాటికీ యెక్కువమేరకు కర్మాగారాదిసంస్థల పనితీరుకుసంబంధించిన అన్ని అంశాలను నిర్ధారించాలి: అంటే వుత్పత్తికి దీంతోపాటు సామాజానికీ సంబంధించిన అంశాలనుకూడా.

ఇందుకోసం మనం కర్తవ్యాలను నిర్దేశించుకుంటున్నాం. అవి మొదటిది; వుత్పత్తికి, అభివృద్ధికివుద్దేశించిన నిధిని నూతన సాంకేతికపరికరాలను సమకూర్చడానికీ, ఆధునికీకరించడానికీ మౌలికాధారంగాచేయడం; రెండవది, సమిష్టిశ్రామికబృందాలు ప్రత్యక్షంగా సంపాదించిన నిధులనుండీ గృహవసతిని, యితర సామాజిక, దైనందిన వసతులను

మెరుగుపర్చడానికి నానాటికి యెక్కువగా డబ్బుకేటాయించడం; మూడవది, ప్రతి ఒక్క కార్మికుడు తుదిఫలితానికి వ్యక్తిగతంగాచేసే దోహదంతో అతని సంపాదనను మరింత నిర్ణయాత్మకంగా ముడిపెట్టడం; నాల్గవది, ఒకరి మేనేజిమెంట్ అవకతవకలకు యితరులు సాధించిన సత్ఫలితాలనుండీ చెల్లింపులుజరగడానికి వీలుకల్పించేమార్గాలన్నిట్నీ మూసి వేయడం: అయిదవది, కాంట్రాక్టుసంబంధాల రంగాన్ని మరింత విస్తరించడానికి కృషి చేయడం, వినిమయదారులకు సరఫరాలవిషయంలో కర్మాగారాదిసంస్థలు తమ నిబద్ధతలను నెరవేర్చేబాధ్యతను మరింతకచ్చితంగామోపడం. యిక చివరిది చాలాముఖ్యమైనవిషయం: సమిష్టిశ్రామికబృందాల చట్టబద్ధమైన హక్కుల్లో వున్నతసంస్థల అల్పఆజమాయిషీని, జోక్యాన్ని నిలిపివేయడం: సమిష్టి శ్రామికబృందాలు తమ పథకాలను నెరవేర్చుకునేందుకై తామే సముచితమైనపద్ధతులను కనుగొనే వీలుకల్పించడం.

కచ్చితంగా చెప్పాలంటే వుత్పత్తిఖర్చుల లెక్కలపద్ధతి పూర్తిగా అమల్లోపెట్టడ మంటేయిదే. కర్మాగారాదిసంస్థలు, అసోసియేషన్లు తమ వుత్పత్తి శక్తిస్తోమతలను శాస్త్ర, సాంకేతికవిజయాలను సాధ్యమైనంత యెక్కువమేరకు వినియోగించుకోవాలనీ, వనరులను గరిష్ఠంగా పొదుపుచేయాలనీ, వినిమయదారుల అవసరాలకు తక్షణమే, నమ్యమైనరీతిలో ప్రతిస్పందించాలనీ యీ ఆర్థికషరతులు అనివార్యంగా డిమాండ్‌చేస్తాయి.

ఉత్పత్తిఖర్చుల లెక్కలురాయడాన్ని మెరుగుపర్చేందుకు మనం పట్టుదలతో కృషిచేయాలి; కర్మాగారాదిసంస్థలు స్వయంగా డబ్బుసమకూర్చుకునేట్టు, స్వయంసమృద్ధిని సాధించేట్టుచూడాలి. యీ సూత్రాలను యిప్పుడు ఓల్గా కార్లకర్మాగారంలో, సూమీలోని పరిశోధన-వుత్పత్తి అసోసియేషన్లో సమగ్రంగా పరిశీలిస్తున్నారు; అవి మంచిఫలితాలను పొందుతున్నాయి. యీ పద్ధతిని మనం పట్టుదలతో అనుసరించాలి.

కొత్తమేనేజిమెంట్ పద్ధతులను మెరుగుపర్చడానికి ఆర్థికప్రమాణాలవ్యవస్థను అభివృద్ధిచేయడం ప్రత్యేకించి ముఖ్యం. యీ ప్రమాణాలను మొత్తం ఐదేళ్ళకాలానికి నిర్దేశించాలి; సమర్థమైనపనికి పాదార్థిక, నైతిక బహుమానాలు తప్పకుండా లభిస్తాయని సమిష్టిశ్రామికబృందాలకు విశ్వాసంకల్గించాలి. అంతేకాదు, ఫలితాలు సరిగాలేకపోతే దాని ప్రభావం మొత్తం సమిష్టిశ్రామికబృందంపై పడుతుంది. యీ విషయంలో ప్రమాణాల స్థిరత్వాన్ని తలకిందులుచేయడం అత్యంతప్రమాదకరం. వుత్పత్తిఖర్చు లెక్కలకు సంబంధించిన అత్యంతకీలకమైన ఆధారాలను బలహీనపర్చేవిధంగా యిది జరుగుతోందని చెప్పడానికి నేను విచారిస్తున్నాను; అందువల్ల దీన్ని కృతనిశ్చయంతో యెదుర్కోవాలి.

ప్రణాళికాబద్ధమైన మేనేజిమెంట్‌కు ఆర్థికప్రమాణాలు విశ్వసనీయమైనసాధనమని నేను నొక్కిచెప్పదలచుకున్నాను. ఆర్థికమేనేజిమెంటులోని కేంద్రీకరణను సరకు-ద్రవ్యసంబంధాలతో, విలువనియమంతో ఆర్థికప్రమాణాలు నమ్యంగా మేళవిస్తాయి. కేంద్రఆర్థికసంస్థలు, మంత్రిత్వశాఖలు, కర్మాగారాదిసంస్థలు వీటిని పూర్తిస్థాయిలో

వినియోగించడాన్ని నేర్చుకోవడం ముఖ్యం. ప్రోదిఅయిన అనుభవాన్ని దృష్టిలో పెట్టుకుని, ప్రమాణబద్ధమైన ప్రాతిపదికపై ప్రభుత్వకర్మాగారాదిసంస్థలకూ, బడ్జెటుకూ మధ్యగల సంబంధాల వ్యవస్థను నెలకొల్పి యీ ప్రమాణాలను వర్తింపజేయాల్సివున్న రంగాన్ని విస్తరించాలి.

కొత్తమేనేజిమెంట్ యంత్రాంగాన్ని పాదుకొల్పినట్టి కర్మాగారాదిసంస్థలహక్కుల విస్తరణవిధానం అనే దాని సూత్రాలను వుత్పత్తిలోని అన్నిస్థాయిల్లో, అంటే బృంద, పనిప్రదేశాలస్థాయివరకూ వర్తింపజేయకపోతే ఆశించినఫలితాల నివ్వదు. యిందుకు అసోసియేషన్లలోని, కర్మాగారాదిసంస్థల్లోని వుత్పత్తిఖర్చులెక్కలను క్రమనుష్యవస్థీకరించే, దానికి ప్రతిఫలంచెల్లించే కాంట్రాక్టుపద్ధతిని అభివృద్ధిచేయడంతో అంగాంగికంగా ముడిపెట్టడం అవసరం. యిది ప్రజాబాహుళ్యాల సృజనాత్మకతకు, చొరవకు గొప్ప అవకాశమిస్తుంది; వుత్పత్తిలో సమిష్టితత్వసూత్రాలు మరింత పటిష్టమౌతాయి; వుమ్మడి ఆశయంకోసం ప్రజలు భాగస్వామ్యం వహించాలనే స్పృహ వారి మనసుల్లో మరింత బాగానాటుకుంటుంది. ప్రతిఒక్కకార్మికుడు ''తాను తన ఫ్యాక్టరీకి యజమానిని అని మాత్రమేగాక, తన దేశానికికూడా ప్రతినిధిననీ, తనకు బాధ్యతవుందనీ భావించ గలుగుతాడు''అనే లెనిన్ ఆదేశం అప్పుడుమాత్రమే అమలుజరుగుతుంది.

మేనేజిమెంట్‌లో ప్రజాతంత్రపద్ధతులను అభివృద్ధిచేయడం, కర్మాగారాదిసంస్థల వ్యవహారాల్లో శ్రామికప్రజల ప్రత్యక్ష భాగస్వామ్యాన్నివిస్తరించడం, సమిష్టిశ్రామిక బృందాలకు సంబంధించిన సోవియట్ యూనియన్ చట్టాన్ని మరింత సంపూర్ణంగా, మరింత సమర్థంగా వర్తింపజేయడం—వీటినిగురించిన సమస్యపట్ల రాజకీయ నివేదికలో కొత్త, సూత్రబద్ధమైనవైఖరి వుంది. ఆర్థిక, సామాజికాభివృద్ధి పథకాలను రూపొందించడంలో, వాటిని నెరవేర్చడంలో, కర్మాగారాదిసంస్థల వ్యవహారాలకు సంబంధించిన అన్ని సమస్యలను పరిష్కరించడంలో సమిష్టి శ్రామికబృందాల క్రియాశీలమైన, సృజనాత్మకమైన భాగస్వామ్యంలేనిదే ఆర్థికయంత్రాంగం సమర్థంగా పనిచేస్తుందని మనం ఆశించలేం. అందువల్లే మేనేజిమెంట్‌లో శ్రామికప్రజల భాగస్వామ్యానికిసంబంధించి ప్రస్తుతమున్న సమిష్టిరూపాలతోపాటు కొత్తరూపాలను కనుగొనడం అవసరం. రాజకీయనివేదికలోచెప్పినట్టుగా, సమిష్టి శ్రామికబృందాల మండలులు అలాంటి సమర్థమైనరూపాల్లో ఒకటి కాగలవు. మేనేజిమెంట్‌లాలూకు ప్రజాతంత్రసూత్రాలను విస్తరింపజేయడంలో పార్టీ, ట్రేడ్‌యూనియన్, కమ్సొమోల్, యితర ప్రజాసంఘాల మాట చెల్లుబడికావాలి.

ఇటీవలికాలంలో మేనేజిమెంట్ సామర్థ్యాన్నిపెంచడంలో వ్యవస్థాత్మకస్వరూపాల పాత్రకుగల ప్రాముఖ్యాన్ని తక్కువ అంచనావేయడం జరిగింది; యిది అజమాయిషీని మెరుగుపర్చే కృషికి ప్రధాన అవరోధంగా వుండింది. వుత్పత్తి అసోసియేషన్లస్థాపన

యిటీవలికాలంలో సమర్థించవీలులేనంతగా మందగించినవిషయం అందరికీ తెలుసు; అనేకపరిశ్రమల్లో అవి నిర్ణాయకవ్యవస్థీకరణరూపంగావుండడంలో విఫలమయ్యాయి. యీ క్రమానికి నూతనోత్తేజంయివ్వడం అవసరం. సమర్థమైన ప్రత్యేకీకరణను, శాఖాపరమైన అవరోధాలులేనిసహకారాన్ని సమకూర్చగలిగే అంతర్‌శాఖా అసోసియేషన్లను పెద్దయెత్తున యేర్పాటుచేయడంలోకూడా మనం మరింత ధైర్యాన్ని కనబర్చాలి.

మంత్రిత్వశాఖల పాత్రపట్ల, విధులపట్ల నూతనవైఖరి అవసరం.వాటి వ్యవస్థాత్మక స్వరూపాలలాగే వాటిపనిసారాంశం, శైలికూడా పాతపద్ధతులకు, ప్రధానంగా పాత మేనేజిమెంట్ నిర్వహణాపద్ధతులకు వుపయోగపడడానికి రూపొందించినట్టివి. సమర్థమైన అజమాయిషీపద్ధతులను ప్రవేశపెట్టే, కర్మాగారాదిసంస్థల, అసోసియేషన్ల హక్కులను విస్తరించేవిషయాన్ని పరిగణనలోకితీసుకుని మంత్రిత్వశాఖలను గణనీయంగా పునర్ వ్యవస్థీకరించాల్సివుంది. వుత్పత్తి ప్రయోజనాలదృష్ట్యా వాటి మునుపటివిధుల్లో కొంత భాగాన్ని సమిష్టి శ్రామికబృందాలకు బదిలీచేయాలి; నిత్యపరిపాటిగా మారినట్టి అనవసర మైనవాటికి స్వస్తిచెప్పాలి; కర్మాగారాదిసంస్థలపట్ల అధికతరవిశ్వాసాన్ని ప్రదర్శించాలి.

ప్రస్తుత పరిస్థితుల్లో, మంత్రిత్వశాఖలు తమకుసంబంధించిన పరిశ్రమల్లో శాస్త్ర, సాంకేతికప్రగతి వ్యూహాన్ని, పరిశ్రమల అభివృద్ధికిగల అవకాశాలను రూపొందించడంపై, ఆర్థికకృషి సాధారణప్రమాణాలను పెంచడంపై, అలాగే అంతిమవిశ్లేషణప్రకారం సరకుల విషయంలో సమాజ అవసరాలన్నిట్నీ తీర్చడంపై ప్రధానంగా తమకృషిని కేంద్రీక రించాలి. యిందుకోసం శాఖలవారీగా అజమాయిషీకి సంబంధించిన వ్యవస్థాత్మకపద్ధతిని కూడా మెరుగుపర్చాలి; అలాగే రెండుస్థాయిల మేనేజిమెంట్‌పథకాన్ని అనుసరించాలి. యింజనీరింగ్ సముదాయానికిచెందిన మంత్రిత్వశాఖల్లో యీ పథకాన్ని విశదీకరించడం యిప్పటికే పూర్తయింది; యీపనిని యితర అన్నిశాఖల్లోకూడా త్వరితంచేయాలి.

మంత్రిత్వశాఖలముందున్న కర్తవ్యాలు సరళమైనవేమీకావు. నూతనమేనేజిమెంట్ పద్ధతిలో వాటిని యే విధంగా అంగాంగికంగా యేకీకృతంచేస్తారనే, కాల అవసరాలకు అవి మానసికంగా యెంత త్వరగా సర్దుబాటుకాగలవనే విషయంపై చాలావరకు విజయం ఆధారపడివుంది.

ఆర్థికయంత్రాంగసామర్థ్యాన్నిపెంచడంలో కేంద్ర ఆర్థికసంస్థల బాధ్యత చాలా యెక్కువగా వుంది. పార్టీవిధాన మౌలికసూత్రాలను అమలుజరిపేవి నిజానికి అవే.

కానీ, కేంద్ర ఆర్థికసంస్థలు చాలాతరచుగా తమ ఆచరణాత్మక కార్యకలాపాల్లో, పద్ధతులనుగురించి మొరటుగా రాసే ఆదేశాల్లో, చేసే సిఫార్సుల్లో సంకుచితశాఖాతత్వానికి ప్రాముఖ్యాన్నిస్తూ, కీలకమైనవిబద్ధతలను నిర్వీర్యంచేస్తూ సమస్యలసారాంశాన్ని వక్రీకరిస్తున్నాయనేది రహస్యమేమీకాదు. దీనివల్ల స్థానికంగా అసంతృప్తి తలెత్తడం

సహజమే. యిలాంటి అలవాటును శాశ్వతంగా నిర్మూలించాలి: పార్టీ నిర్ణయాలను తు.చ. తప్పకుండా పాటించాలి.

ప్రస్తుతం కొనసాగుతున్న ఆర్థికయంత్రాంగ పునర్వ్యవస్థీకరణవిజయం చాలామేరకు సోవియట్ యూనియన్ ప్రభుత్వప్రణాళికారచనా కమిటీపై ఆధారపడివుంది. అది నూతనావసరాలకు తగ్గట్టుగా తన కార్యకలాపాలను నిర్వహించాలి; కీలకకర్తవ్యాల పట్ల సమగ్రవైఖరికి ప్రాముఖ్యాన్నివ్వాలి: ఆర్థికవ్యవస్థ సమతూకంగా, సమర్థంగా అభివృద్ధిచెందడానికి పూర్తి బాధ్యతను వహించాలి. సోవియట్ యూనియన్ ప్రభుత్వ ప్రణాళికారచనా కమిటీ స్వరూపాన్ని యీ స్ఫూర్తితో పునర్వ్యవస్థీకరించడంకూడా అవసరం; తన కార్యకలాపాలను సత్ఫలితాలనుయివ్వగల ధోరణులపై, ప్రధానంగా జాతీయార్థిక, అంతర్శాఖానిష్పత్తులను, మండలనిష్పత్తులను రూపుదిద్దడంపై కేంద్రీకరించేందుకు పునర్వ్యవస్థీకరణ అవసరం.

సోవియట్ యూనియన్ ప్రభుత్వ సరఫరాలకమిటీకూడా బాధ్యతాయుతమైన కర్తవ్యాలను నెరవేర్చాల్సివుంది. నూతన ఆర్థికయంత్రాంగ అవసరాలకు దీటుగా వుంచేందుకై దాని పనిని పునర్వ్యవస్థీకరించాల్సివుంది; టోకువ్యాపారంతోసహా సరఫరా, పంపిణీలకు సంబంధించి సమర్థమైన పద్ధతులను ప్రవేశపెట్టాలి.

మనం సోవియట్ యూనియన్ ఆర్థిక మంత్రిత్వశాఖనుండీ సాహసోపేతమైన, కృతనిశ్చయంతోకూడిన కార్యాచరణను ఆశిస్తున్నాం. యిటీవలికాలంలో ఆర్థిక వ్యవహారాల్లో, అలాగే ఆర్థికవ్యవస్థ లాభదాయకతనుపెంచే కృషిలో ద్రవ్యం దుర్బలమైన పాత్రను నిర్వహించింది. అంతేగాక, అనేకసందర్భాల్లో ద్రవ్య, పరపతియంత్రాంగం ప్రగతిశీలమైన మార్పులను నిలువరిస్తోంది. అది వుత్పత్తినిపెంచడంపై, పొదుపరితనానికి హామీకల్పించడంపై కృషిని కేంద్రీకరించేందుకు గణనీయమైన మార్పులు అవసరం.

నూతనావసరాలకు అనుగుణంగా సోవియట్ యూనియన్ స్టేట్‌బ్యాంక్, సోవియట్ యూనియన్ స్ట్రోయ్‌బ్యాంక్‌ల కార్యకలాపాల్లోకూడా మార్పులు తీసుకరావాలి. ప్రస్తుతంపరపతివిధానం యెంతో అసమర్థంగావుంది. కర్మాగారాదిసంస్థలు, ఆర్గనైజేషన్లు, సమిష్టివ్యవసాయక్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు రుణాలను హేతుబద్ధంగా వినియోగించుకోడానికి, ఫలదాయకతను పెంచుకోడానికి, ప్రభుత్వంతో లెక్కలను సకాలంలో, పూర్తిగా తేల్చుకోడానికి ప్రోత్సహించగల పరిస్థితులు యిప్పటికీ యేర్పడలేదు. బ్యాంకులు ప్రభుత్వప్రయోజనాలను కాపాడాలి: అదేసమయంలో సమిష్టి బృందాల చొరవను, ఆర్థికపరమైన తెగువను అన్నివిధాలా పెంపొందించాలి.

ఆర్థికవ్యవస్థ సాంద్రీకరణఅనేది ఖర్చుల ఫలదాయకతకు, ఆర్థికకార్యకలాపాల ఫలితాలకు విశ్వసనీయమైన కొలమానాలుగా, శాస్త్ర, సాంకేతికప్రగతికి, వుత్పత్తుల నాణ్యత పెంపుదలకు సమర్థమైన ప్రేరకాలుగా ధరలపాత్రను పెంచుతోంది. యీ

విషయంలో ప్రభుత్వధరలకమిటీ నిర్వహించాల్సినపాత్ర చాలాగొప్పది. యీ రంగంలో పేరుకపోయిన సమస్యలను అది మరింత శీఘ్రంగా, మరింత సమర్థంగా పరిష్కరించాలి. చిల్లరధరలకు సంబంధించిన పనికూడా మన సామాజికవిధానలక్ష్యాలకు అనుగుణంగా వుండాలి.

ఇటీవలికాలంలో సోవియట్ యూనియన్ ప్రభుత్వవ్యవసాయ-పారిశ్రామికకమిటీ, యింజనీరింగ్ బ్యురోలాంటి పెద్దఆర్థికసముదాయాలకోసం నూతన మేనేజిమెంట్ సంస్థలను నెలకొల్పిన విషయం మనకుతెలుసు. వాటి స్వరూపం, విధులు భిన్నమైనవి: అవి ఆయాసముదాయాల ప్రత్యేకతలను ప్రతిబింబిస్తున్నాయి; యిదిమాత్రమే సరైన దనిపిస్తోంది. అనుభవంప్రోదిఅయ్యేకొద్దీ పరస్పరసంబంధంగలబృందాల,తత్సంబంధమైన శాఖల మేనేజిమెంట్‌ను మెరుగుపర్చడం అభిలషణీయం.

శాఖ, ప్రాదేశిక అజమాయిషీని సవ్యంగా మేళవించడంపట్ల మరింతశ్రద్ధ కనబర్చాలి. యిలాచేస్తున్నప్పుడు, ఆర్థికప్రణాళికారచనలో, మేనేజిమెంట్‌లో, ప్రత్యేకించి శ్రామికప్రజల దైనందినావసరాలకు సంబంధించిన పరిశ్రమల్లో, రంగాల్లో మనం స్థానికసోవియట్ల హక్కులను మరింత చొరవతో విస్తరించాలి.

మేనేజిమెంట్‌లో, ఆర్థికయంత్రాంగంలో మెరుగులవల్ల, వీటితోపాటు నిర్ణయాలు తీసుకోవడంలో శాస్త్రీయదృక్పథానికి యెక్కువప్రాధాన్యత యివ్వడంవల్ల ఆర్థిక వేత్తలపై నూతన, వున్నత బాధ్యతలుపడుతున్నాయి. దేశానికి వారు చేయాల్సిన సేవ యెంతోవుంది. వారు సమర్థమైన సైద్ధాంతిక అధ్యయనాలు జరుపుతారనీ, నిర్దిష్ట ఆచరణాత్మక సిఫార్సులనుచేస్తారనీ మనం ఆశిస్తున్నాం.

కామ్రేడ్స్, టూకీగాచెప్పాలంటే, 12వ పంచవర్షప్రణాళికాకాలంలో ప్రయాసతో కూడినకృషి చేయాల్సివుంది: ఆర్థికయంత్రాంగానికిచెందిన కొలుకులన్నిటినీ మనం పునర్వ్యవస్థీకరించాలి. మనం యీపనిచేస్తున్నప్పుడు, ప్రస్తుతమున్న మేనేజిమెంట్ స్వరూపాలూ, రూపాలూ యీనాటికర్తవ్యాలకు దీటురాగలిగినట్టివిగా, గుణాత్మకంగా నూతన మైనవిగా అంగాంగికంగా అభివృద్ధిచెందేట్టుచూడాలి. వుత్పత్తిలో స్థిరమైన పెరుగుదలకు, దాని సామర్థ్యంపెరుగుదలకు యీ పరిణామక్రమం హామీకల్పించాలి. యిది ముఖ్యమైన విషయం; దీనిపై మనశ్రద్ధను కేంద్రీకరించాలి; యిది కేంద్ర ఆర్థికసంస్థల, మంత్రిత్వ శాఖల, పార్టీసంస్థల నిరంతర అజమాయిషీలోవుండాలి. దీన్ని ప్రతిరోజూ, పట్టుదలతో గతంలోజరిగినతీరులోగాకుండా రీతివాదానికి, యేరకమైన అవరోధానికికూడా తావివ్వకుండా, తలెత్తనున్న యిబ్బందులకు తలవంచకుండా నిర్వహించాలి.

ఇందులో మనకెదురయ్యే ప్రమాదాలన్నిట్లోకీ యెంతో ప్రమాదకరమైనది అధికార

జాప్యం. పనిచేస్తున్నట్టు నటిస్తూ, నిరర్థకమైన వాగాండబరపు ముసుగువేసుకుని ఆర్థిక యంత్రాంగ మెరుగుదలను నిరంకుశాధికారులు నిలవరించవచ్చు: స్వేచ్ఛను, చొరవను, అణచిపెట్టవచ్చు: నూతనకల్పనలమార్గంలో అవరోధాలను సృష్టించవచ్చు.

అజమాయిషీవ్యవస్థ, మేనేజిమెంట్ పద్ధతుల పునర్వ్యవస్థీకరణవిజయం మన కేడర్లకు వృత్తిపరమైన శిక్షణనివ్వడంపై ఆధారపడివుంది; యీ శిక్షణ తక్షణసమస్య. అన్నివృత్తులకూచెందినవారికి శిక్షణనివ్వడంలో అర్థశాస్త్రాన్నిగురించిన పరిజ్ఞానాన్ని కలిగివుండడం అనివార్యమైన, ముఖ్యమైన అంశం.

సాంకేతికపరిష్కారాల ఆర్థికపార్శ్వాన్ని కార్మికులు, యింజనీర్లు ప్రతిఒక్కరూ సమర్థంగా, ప్రతిభావంతంగా మదింపువేయగలిగేవిధంగా వారికి అర్థశాస్త్రాన్ని బోధించే సమర్థమైనవిధానాన్ని మనం రూపొందించాలి. అందువల్ల మనం ఆర్థికవిషయాలను బోధించే వున్నతపాఠశాలల, విశ్వవిద్యాలయ ఆర్థికవిభాగాలతోసహా శిక్షణకుసంబంధించిన అన్నిపద్ధతుల స్వభావాన్ని, సారాన్ని బాగాసవరించాలి. ప్రముఖ ఆర్థికవేత్తలను, అంటే పరిశోధకులను, ప్రాక్టీషనర్లను వుభయులనూ యీకృషిలోకి ఆకర్షించాలి. యిక చివరి విషయం: అర్థశాస్త్రంలో ప్రవీణులకు పునశ్శిక్షణనిచ్చేందుకై మేనేజిమెంట్‌లోని అన్ని స్థాయిలకూ పరివ్యాప్తమైనట్టి బాగా ఆలోచించి రూపొందించినవిధానం అవసరం.

ఆధునిక అర్థశాస్త్రం వుత్పత్తిసారథులపై ప్రత్యేకించి వున్నతబాధ్యతలను మోపుతోంది. మన మేనేజర్లలో అధునాతన ఆర్థికచింతనను—అంటే వున్నతస్థాయి వృత్తిపరనైపుణ్యం, నోషలిస్టుతెగువ, భవిష్యత్తులోకి చూడగలనేర్పు, సమిష్టి శ్రామిక బృందంలో ప్రబోధకులుగా, అగ్రనైజర్లుగావుండగలశక్తి—మనం పెంపొందించడం ముఖ్యం. పార్టీనిగురించిన భావపరిపక్వత, సూత్రానికి కట్టుబడివుండడం, పార్టీపంథాను అచంచలంగా అమలుజరపడం, మచ్చలేని నైతికగుణాలు—యివి యీనాటి మేనేజర్లకు తప్పనిసరిగా వుండాల్సినలక్షణాలు. మన నిర్మాణాత్మకప్రణాళికలను అమలుజరపడానికి యివి అత్యవసరం.

మొత్తం మేనేజిమెంట్‌వ్యవస్థను నిర్దుష్టంచేయడానికి సంబంధించిన లక్ష్యాలు ఆర్థికంగానేగాక, రాజకీయంగాకూడా యెంతో ముఖ్యమైనవి. యీకారణంగా వాటి అమలుపై పార్టీసంస్థలు నిరంతరం అజమాయిషీనెరపాలి; దానికి మార్గదర్శకత్వం నిర్వహించాలి. సామాజిక, ఆర్థికపరిణామక్రమాల ప్రగాఢ నిర్దిష్టవిశ్లేషణ, పార్టీ ఆర్థిక విధానాన్ని అమలుజరపడంలో పట్టుదల, ఆర్థికనిర్వహణాధికార్ల సక్రమనియామకం, శిక్షణ, కొత్త, ప్రగతిశీలమైన ప్రతిదాన్నీ పెంపొందించేందుకు సంసిద్ధత—ఆర్థిక విషయాలగురించి పార్టీ మార్గదర్శకత్వాన్ని ప్రధానంగా కేంద్రీకరించాల్సిన, పటిష్ఠం చేయాల్సిన దిశలు యివీ.

# 5. విదేశీ ఆర్థికసంబంధాలు

కామ్రేడ్స్, దేశసామాజిక, ఆర్థికాభివృద్ధిని త్వరితంచేయడానికి వుద్దేశించిన పార్టీవిధానం మన విదేశ ఆర్థికకార్యకలాపాలపై అత్యున్నత బాధ్యతను మోపుతోంది. ఆర్థిక, శాస్త్ర, సాంకేతికసంబంధాలను చురుగ్గా అభివృద్ధిచేసుకోవడం, అంతర్జాతీయ శ్రమవిభజనలో పాల్గొనడం ఆధునికప్రపంచంలో చాలా అవసరమని మన అభిప్రాయం. అవి మనకు రాజ్యాలమధ్య శాంతియుత, మంచి యిరుగుపొరుగు సంబంధాలను కొనసాగించి పటిష్టంచేసే, జాతీయార్థికసమస్యలను పరిష్కరించుకోవడంలో పరస్పర సహాయానికితోడ్పడే ముఖ్యమైన సాధనాలు.

2000వ సంవత్సరంనాటికి దశలవారీగా అణ్వాయుధాలను ధ్వంసంచేయాలనే సోవియట్ ప్రతిపాదనలనూ, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ రాజకీయ నివేదికలో పేర్కొన్న యితర శాంతి ప్రతిపాదనలనూ అమలుజరిపితే అన్ని దేశాల ప్రయోజనానికి అనుగుణంగా అంతర్జాతీయసహకారానికీ, దాని ముమ్మరాభివృద్ధికీ పూర్తిగా కొత్త పరిస్థితిని సృష్టించవచ్చు. మానవాళి ధ్వంసమైపోయే ప్రమాదాన్ని నిరాయుధీకరణ తొలగిస్తుంది; దీనివల్ల ఆర్థికాభివృద్ధికి అపారమైన పాదార్థిక, బౌద్ధికవనరులు లభ్యమౌతాయి. లెనినిస్టు శాంతివిధానానికి విధేయంగావున్న సోవియట్ యూనియన్ అంతర్జాతీయపరిస్థితిని మెరుగుపర్చడానికీ, సామాజికవ్యవస్థలతో నిమిత్తంలేకుండా అన్ని దేశాలతో సమానఫాయానసహకారాన్ని కొనసాగించి, పటిష్టంచేయడానికీ శక్తివంచనలేకుండా కృషిచేస్తోంది. యీ పంథానుండీ తమను మళ్ళించడానికి మన పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ యెవరినీ అనుమతించవు—సామ్రాజ్యవాదశక్తులు యెలాంటి బెదిరింపులుచేసినాసరే, జెనీవా సంప్రతింపులను ప్రధానలక్ష్యంనుండీ మళ్ళించడానికి అవి యెన్నిప్రయత్నాలుచేసినాసరే యీ పంథానుండీ మళ్ళించడానికి అనుమతించవు.

దీని కనుగుణంగానే, విదేశీ ఆర్థికసంబంధాలను గణనీయంగా విస్తరించడానికి మార్గదర్శకసూత్రాలముసాయిదాలో సూచించడం జరిగింది. వీటిని ప్రాధాన్యతా అంశాలపై, శాస్త్ర, సాంకేతికప్రగతిపై కేంద్రీకరిస్తారు; సామాజికలక్ష్యాలసాధనకు విస్తృతంగా వినియోగిస్తారు.

సోదరసోషలిస్టుదేశాలతో సహకారం మునుపటిలాగే సర్వదా నిర్ణాయకఅంశంగా వుంటుంది. స్మియా సభ్యదేశాల ఆర్థికశిఖరాగ్ర సమావేశనిర్ణయాలకు అనుగుణంగా సోషలిస్టు యేకీకరణను పాదుకొల్పడంలో, విస్తృతమైన వుత్పత్తిసహకారం, ప్రత్యేకీకరణల ప్రాతిపదికపై దాన్ని అభివృద్ధిచేయడంలో సమీపభవిష్యత్తులోనే ఒకపెద్ద ముందంజవేయడం జరుగుతుంది. యిది సోదరసోషలిస్టుదేశాలమధ్య ఆర్థికసంబంధాల

యితోధికసర్వతోముఖ విస్తరణకూ, మనదేశాలకు వుమ్మడిఅంశంగావున్న సాంద్రీకరణ కర్తవ్యసాధనను త్వరితంచేయడానికీ నూతనావకాశాలను ఆవిష్కరిస్తుంది: సామ్రాజ్య వాదం తీసుకుంటున్నచర్యలకు వ్యతిరేకంగా మన ఆర్థిక, సాంకేతిక అభేద్యతను మరింత పెంచుతుంది.

2000వ సంవత్సరంవరకూ స్మియా సభ్యదేశాల శాస్త్ర, సాంకేతికప్రగతికి వుద్దేశించిన సమగ్రకార్యక్రమాన్ని యేకరీతిగా అమలుజరపడం యీ కృషికంతటికీ వెన్నెముకగావుంటుంది. తాజా శాస్త్ర, సాంకేతికవిజయాల్లో సంయుక్తంగా ప్రావీణ్యత సంపాదించడం, ఆర్థికవ్యవస్థలోని అన్నిశాఖల్లో ముఖ్యంగా, రకరకాల అధునాతన యంత్రాల, యంత్రపరికరాల వుత్పత్తిలో భారీస్థాయి సహకారాన్ని అభివృద్ధిచేయడం— యేకీకరణలో యిప్పుడు కేంద్రస్థానం వీటికి మారుతోంది. యీ దృష్ట్యా మన కేంద్ర ప్రణాళికారచనాసంస్థలు, ఆర్థికసంస్థలు, మంత్రిత్వశాఖలు, డిపార్ట్‌మెంట్లు తమ విదేశీ ఆర్థికకార్యకలాపాలను తగువిధంగా వ్యవస్థీకరించుకోవాల్సివుంది. సోషలిస్టుదేశాల సమిష్టి సంస్థఅయిన పరస్పర ఆర్థికసహాయసమితివనివి మెరుగువర్చడంపైకూడా యిది చాలామేరకు ఆధారపడివుంటుందనేది వాస్తవం.

1986-1990 కాలానికి వుద్దేశించిన స్మియాదేశాల జాతీయార్థికపథకాల సమన్వయీకరణకృషి యిటీవలే పూర్తయింది; యిది ప్రస్తుత ఐదేళ్ళకాలంలోనే యెంతో సాధించడం జరుగుతుందని తెలియజేస్తోంది. యేకీకరణక్రమాలను మరింత ప్రగాఢంచేయ డానికి సృజనాత్మక,నూతనకల్పనావైఖరి అవసరమనేమాటనిజం. విస్తృతాభివృద్ధికాలంలో రూపుగొన్నపాత, మామూలురూపాలు సహకారంలో యెలాంటి శక్తివంతమైన అభివృద్ధినీ సాధించలేవు. అందువల్ల నూతనవైఖరులను కనుగొనడం అవసరం: కర్మాగారాదిసంస్థల మధ్య, ఆర్థికవ్యవస్థలోని అన్నిశాఖలమధ్య ప్రత్యక్షపరస్పరసహకారాన్ని పట్టుదలతో ప్రవేశపెట్టాలి: ప్రత్యక్షఆర్థికసంబంధాలను అభివృద్ధిచేయాలి:సంయుక్త ఆసోసియేషన్లను, పరిశోధన-అభివృద్ధి బ్యూరోలను, ప్రయోగశాలలను యేర్పాటుచేయాలి. యీ క్రమం మొదలైంది. అనేకసంయుక్తపరిశోధన-వుత్పత్తి అసోసియేషన్లు యేర్పాటయ్యాయి. యేకీకరణతాలూకు కొత్తరూపాలకు యివన్నీ నాందీవాచకాలుమాత్రమే. కానీ, భవిష్యత్తు వాటిలోనేవుంది.

ఇతర సోషలిస్టుదేశాలతో ఆర్థికసంబంధాలను మరింత విస్తరించుకోవాలని మార్గదర్శకసూత్రాలు సూచించాయి. చైనాప్రజారిపబ్లిక్కుతో వ్యాపారాన్ని గణనీయంగా పెంచుకోవాలి.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాల్లోని దేశాలతో సోవియట్ యూనియన్ తన సహకారాన్ని పెంచుకుంటూనేవుంటుంది. యీ దేశాలకు మనం అందజేస్తున్న బహుముఖసహాయం వాటి జాతీయార్థికవ్యవస్థలు నిలదొక్కుకోవడానికీ, అభివృద్ధిచెందడానికీ, వలసపాలన దుష్ఫలితాలను అధిగమించడానికీ, ఆర్థిక,సామాజికప్రగతిపథాన పురోగమించ డానికీ తోడ్పడుతోంది. వీటిలో అనేకదేశాలతో సోవియట్ యూనియన్‌కు స్థిరమైన, దీర్ఘకాలిక సంబంధాలున్నాయి. వుదాహరణకు భారతదేశం, యితర కొన్నిదేశాలు. యీ సంబంధాలు నానాటికీ మరింత పరస్పరప్రయోజనకరంగా రూపొందుతున్నాయి. వర్ధమానదేశాలను, ప్రత్యేకించి సోషలిస్టు వున్ముఖతగలదేశాలను బలపర్చే మన విధానం న్యాయమైన, ప్రజాతంత్రప్రాతిపదికపై అంతర్జాతీయ ఆర్థికసంబంధాలను పునర్వ్యవస్థీక రించడంలో ఒక ముఖ్యమైనఅంశమైంది; యీ విధానాన్ని కొనసాగిస్తాం.

శాంతియుత సహజీవనవిధానానికి విధేయంగావున్న సోవియట్ యూనియన్ అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీదేశాలతో సహకారానికి సుముఖంగావుంది. యీవిషయంలో గణనీయమైన శక్తిస్తోమతలు మనకు కనిపిస్తున్నాయి. యిది దాదాపు అన్నిరకాల సంబంధాలకు, అంటే వాణిజ్య, శాస్త్ర, సాంకేతిక, ద్రవ్య, పరపతిసంబంధాలకు,యింకా యితరసంబంధాలకు వర్తిస్తుంది. సహకారం రెండువైపులనుండీ సాగాల్సిన వ్యవహార మనేది నిజం. యీ విషయంలో పరస్పరప్రయోజనాన్ని కచ్చితంగా పరిగణన లోకి తీసుకోవాలి; అమెరికావిధించిన అన్నిపరిమితులను, బహిష్కరణలను, ఆంక్షలను పూర్తిగా విసర్జించాలి. సమానహక్కులు, పరస్పరవిశ్వాసం, కుదుర్చుకున్న ఒప్పందాల కచ్చితమైనపాటింపు—వీటి ప్రాతిపదికపైమాత్రమే ఆధునికప్రపంచంలో ఆర్థికసంబంధా లను నెలకొల్పడంసాధ్యం. యిందుకుభిన్నంగా కుత్సితమైన రాజకీయలక్ష్యాలకు వాణిజ్య, ఆర్థికసంబంధాలను లోబడివుండేట్టుచేయడం ప్రపంచప్రగతిని నిలిపివేయడానికి ప్రయత్నించడంతోసమానం. అలాంటి ప్రయత్నాలవల్ల ప్రయోజనమేమీవుండదని చరిత్ర అనుభవం తెలియజేస్తోంది. దీన్ని దృష్టిలోపెట్టుకునిచూస్తే, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ రాజకీయనివేదికలో ఒక నూతన ప్రతిపాదనవుంది—అది ఆర్థికభద్రత సమస్యలపై భవిష్యత్తులో ప్రపంచమహాసభను యేర్పాటుచేయడంగురించిన ప్రతిపాదన; ఆ మహాసభలో ప్రపంచ ఆర్థికసంబంధాలకు అవరోధంగావున్న ప్రతిఒక్కవిషయాన్ని గురించి చర్చించడానికి వీలుంటుంది.

మన ఆర్థికవ్యవస్థఅభివృద్ధికి విదేశీవ్యాపారం స్పష్టమైన దోహదంచేస్తోంది: యిది నానాటికీ యెక్కువగా వుంటోంది. విదేశీ ఆర్థికసంబంధాల పరిధి బైట యిప్పుడు దాదాపు యేఒక్కశాఖకూడాలేదు. కానీ, సంప్రదాయపద్ధతుల్లో త్వరితంగా ముందుకు

సాగడం అసాధ్యం. మొట్టమొదట చేయాల్సింది ముడిపదార్థాల యెగుమతికి మనమిస్తున్న ప్రాధాన్యతను తొలగించడం, సరకులతయారీ పరిశ్రమవాటాను పెంచడం. యిందుకు వ్యవధి అవసరమనేమాట నిజమే, కానీ, యీ దిశలో పని 12వ పంచవర్ష ప్రణాళికా కాలంలోనే ప్రారంభంకావాలి. దేశ యెగుమతిస్తోమతను పెంచాలనీ, యంత్రాల, యంత్రపరికరాల, యితర యంత్రనిర్మితసరకుల నాణ్యతను, పోటీకి తట్టుకుని విల్చే శక్తిని పెంచాలనీ మంత్రిత్వశాఖలకు, అసోసియేషన్లకు, కర్మాగారాదిసంస్థలకు ఆదేశమివ్వాల్సివుంది. విదేశీమారకద్రవ్యం విషయంలోకూడా చాలా పకడ్బందీగా వ్యవహరించాలి. కొత్త, సాంకేతికప్రగతిని త్వరితంచేయడంలో మన దిగుమతివిధానం క్రియాశీలమైనదోహదం చేయాలి.

నూతన అవసరాలస్ఫూర్తితో విదేశీ ఆర్థికసంబంధాలసంస్థలనుకూడా పునర్ వ్యవస్థీకరించాలి. విదేశీ వాణిజ్య మంత్రిత్వశాఖ పనిలో, విదేశీ ఆర్థికసంబంధవిషయాల ప్రభుత్వకమిటీ పనిలో యిప్పటికీ పెద్దపొరపాట్లు. లోటుపాట్లు జరుగుతున్నాయి. వీటిని చాలానెమ్మదిగా తొలగిస్తున్నారు. యీ సంస్థలకు మంత్రిత్వశాఖలతో, కర్మాగారాది సంస్థలతో సన్నిహితసంబంధాలువుండడం అవసరం. యివి తమ ప్రయోజనాలతో విదేశీమార్కెట్ అవసరాలను మేళవించే రూపాలకోసం అన్వేషించాలి; జాతీయ ఆర్థిక కర్తవ్యాలను నెరవేర్చడంలో యివి దలారీలుగాగాక క్రియాశీలమైన భాగస్వాములుగా వుండాలి.

# V. 12వ పంచవర్షప్రణాళికాకాలంలో సామాజికాభివృద్ధి, ప్రజాసంక్షేమం మెరుగుదల

కామ్రేడ్ ప్రతినిధులారా, 12వ పంచవర్షప్రణాళికలో తలపెట్టిన ఆర్థికరంగ అభివృద్ధి, దాని సామర్థ్యం పెరుగుదల సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమలక్ష్యాలను సాధించడానికి నమ్మకమైన పునాదిని వేస్తున్నాయి. సోవియట్ప్రజల జీవనప్రమాణాన్ని గుణాత్మకంగా నూతనస్థాయికి పెంచడం, వారిపని, జీవనపరిస్థితులను స్థిరంగా మెరుగుపర్చడం—యివి ఆ లక్ష్యాలు. ఆ లక్ష్యాలను వ్యక్తుల సమరసవికాసంతో, శ్రామికప్రజల సృజనశీలచొరవ వుద్దీప్తితో పార్టీ అనుసంధిస్తోంది. యిది సోవియట్ యూనియన్ సామాజికప్రగతివేగాన్ని నిర్దేశిస్తున్న పూర్వరంగంలో ఒకశక్తివంతమైన సామాజిక విధానంలోని సారభూతాంశం. సామాజికన్యాయసూత్రాన్ని ముందుకు

తీసుకెళ్ళడం, సరకులను, సదుపాయాలను సంపూర్ణంగా సోషలిస్టుపద్ధతిలో పంపిణీచేయడం ముఖ్యమైన విషయం.

తదనుగుణంగా 12వ పంచవర్ష ప్రణాళికలో సమస్యల పరిష్కారంపట్ల ప్రత్యేక శ్రద్ధ కనబర్చడం జరుగుతోంది; ఆ సమస్యల పరిష్కారం సోవియట్ ప్రజల జీవిత నాణ్యాన్ని, కార్యకలాపాలను గరిష్ఠంగా మెరుగుపర్చడానికీ, వుమ్మడిఆశయాలకై ప్రతిఒక్క సోవియట్ పౌరుడుచేసే శ్రమదోహదాన్ని పెంచడానికీ తోడ్పడుతుంది.

సామాజిక, ఆర్థికాభివృద్ధి ప్రయోజనాలు రెంటికోసం ముఖ్యంగా శ్రమపరిస్థితుల్లో, స్వభావంలో, వస్తువులో తీవ్రమైనమార్పులు అవసరం. సమాజసభ్యుల వివిధఅవసరాల్లో సార్థకమైన, సృజనాత్మకమైన శ్రమఆవశ్యకత అంతకంతకూ పైకొంటోంది. కొత్త పంచవర్ష ప్రణాళికాకాలంలో నైపుణ్యంలేని శ్రమ, శారీరకశ్రమ వినియోగాన్ని తగ్గించే అత్యవసర కర్తవ్యంలో మలుపు తీసుకరావాలి. యీ తగ్గింపుస్థాయినీ, రేటునూ కనీసం 100-200 శాతంపెంచాలి.

ఉత్పత్తియంత్రాంగ ఆధునికీకరణను, వుత్పత్తి యాంత్రీకరణను, స్వయంచాలనీకరణను, కంప్యూటర్ల అమర్పును త్వరితంచేయడం, కొత్తసాంకేతికయంత్రాలకోసం జరిగే యావత్తుకృషి—యివి శ్రమపరిస్థితులను మెరుగుపర్చేలక్ష్యంతో, శ్రమఅంతర్గత వస్తువును సుసంపన్నంచేసేలక్ష్యంతోసాగాలి. పనిప్రదేశాల్లో యేర్పాట్లు సరిగావున్నట్లు ధ్రువీకరించడం, శాస్త్రీయంగా శ్రమను వ్యవస్థీకరించడం యీ లక్ష్యానికి తోడ్పడాల్సి వుంటుంది.

ఈ సమస్యకుగల యితరపార్శ్వాన్నికూడా మనం గుర్తుంచుకోవాలి. సోవియట్ కార్మికుని వున్నతవిద్య, వృత్తిప్రమాణాలమూలంగా వుత్పత్తిలో తదనుగుణమైన పరిస్థితులను సృష్టించడం అవసరం. కాలంచెల్లిన యంత్రాలను వదిపేందుకు, పాత సాంకేతికపద్ధతులను వినియోగించేందుకు యీనాటి కార్మికుడు అంగీకరించడు. మేనేజర్లు యీ విషయం గుర్తుంచుకోవాలి.

ప్రతిఫలంచెల్లింపువ్యవస్థ ప్రభావాన్నిపెంచడం బ్రహ్మాండమైన సామాజిక, ఆర్థిక ప్రాముఖ్యంవున్న కర్తవ్యం. ఒకేగాటకట్టేఅంశాలు యిటీవల పెరగడంవల్ల పనికోటాలు నిర్ణయించడంలో, వేతనాల, జీతాల వ్యవస్థీకరణలో కొట్టవచ్చినట్లున్న లోపాలు ప్రోత్సాహకాలుగావున్న వేతనాల, జీతాల పాత్రను దెబ్బతీశాయి; వుత్పాదకత పెరుగుదలను

అరికడుతున్నాయి. యిది సహించరానిది. ప్రతిశ్రామికుని ఆదాయాలు కచ్చితంగా అతని, లేక ఆమె పనిఫలితాలకు అనుగుణంగావుండాలి. ప్రతిఫలం చెల్లింపుల పెరుగుదలను వుత్పాదకత పెరుగుదలతో గట్టిగాముడిపెట్టడం ఆధునికఆర్థికవ్యవస్థ ముఖ్యావసరాల్లో ఒకటి; దీన్నితప్పకుండా పాటించాలని మనం పట్టుపడతాం.

మూలవేతనాలరేట్లను, జీతాలను, మార్గదర్శకసూత్రాల్లో తలపెట్టినవిధంగాపెంచే ప్రధాన కర్తవ్యాన్ని యెలాఅమలుజరపాలో మనం నిర్ణయించాల్సింది యీ పరిస్థితిలోనే: స్వల్పకాలంలో, యించుమించు అయిదేళ్ళలోనే పాదార్థికవుత్పత్తికి సంబంధించిన వివిధరంగాల్లో కొత్తమూలవేతనరేట్లను, జీతాలను ప్రవేశపెట్టడం అవసరమని అనుకుంటున్నాం. వాటిని సగటున 25-30 శాతం పెంచాల్సివుంది. యిందుకై నిధులను యెక్కడినుండీ తేవాలనేసమస్యవిషయంలో మనం మౌలికంగా ఒకకొత్తక్రియాత్మక వైఖరిని రూపొందించాం. బహుశా, యిది అతిముఖ్యమైనవిషయం. వుత్పత్తిని పెంచడం, సామర్థ్యాన్నిపెంచడం, అంతర్గతస్తోమతలను వినియోగంలోకి తీసుకరావడం, శ్రమవ్యవస్థీకరణను, పనికోటాల నిర్ధారణను మెరుగుపర్చడం—వీటిద్వారా ప్రధానంగా సమిష్టి శ్రామికబృందాలే యిందుకవసరమైన నిధులను ఆర్జించాలి.

ఈ వైఖరివల్ల కొత్త మూలవేతనరేట్లనూ, జీతాలనూ ప్రవేశపెట్టడం కర్మాగారాల స్థాయిలో పనిమెరుగుదలపై,వుత్పాదకతపెరుగుదలపై ప్రత్యక్షంగా ఆధారపడివుంటుంది. కొత్త ఆర్థికపరిస్థితుల్లో పనిచేస్తూ అనేక పారిశ్రామిక, తదితరసంస్థలుగడించిన అనుభవం యీ దృక్పథానికి ప్రాతిపదిక. యీ పద్ధతిని బైలోరష్యన్ రైల్వేలో ప్రయోగాత్మకంగా పరీక్షించిచూశారు. విస్తృతమైన ఆర్థిక, వ్యవస్థాత్మక సన్నాహకకృషిద్వారా, యంత్రాలను మరింతబాగా వినియోగించడంద్వారా లభించిన అంతర్గతవనరులతో మూలవేతనరేట్లనూ, జీతాలనూ పెంచారు.

ఉత్పత్తేతర రంగాల్లో నియమితులైనవారి వేతనాలను, జీతాలను పెంచడానికి గణనీయమైన నిధులను కేటాయించాం. పాఠశాలసంస్కరణలో తలపెట్టినట్టు వచ్చేసంవత్సరంలో పౌరవిద్యారంగంలో పనిచేస్తున్నవారందరికీ జీతాలకుసంబంధించిన కొత్తనిబంధనలను వర్తింపజేయడం పూర్తవుతుంది. వైద్యుల, యితర వైద్యసిబ్బంది జీతాలు దశలవారీగా పెరుగుతాయి. సాంస్కృతికసంస్థల్లో, వున్నత విద్యాసంస్థల్లో కొన్ని తరగతులకుచెందిన వుద్యోగుల మూలవేతనరేట్లను, జీతాలనుకూడా 12 వ పంచవర్ష

ప్రణాళికలో పెంచుతారు. సామాజిక-సాంస్కృతికరంగ యితోధికఅభివృద్ధిపట్ల పార్టీ శ్రద్ధకు యీ చర్యలు ఒక నిర్దిష్టవ్యక్తీకరణ.

ఆదాయాలవిషయంలో అమలుజరగనున్న యీ చర్యలమూలంగా ప్రస్తుత అయిదేళ్ళకాలం ముగిసేనాటికి సగటు నెలసరివేతనాన్ని, జీతాన్ని 215-220 రూబుళ్ళకు పెంచడానికి వీలవుతుంది.

సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేసేపనికి ప్రతిఫలం మరింత శీఘ్రగతిన పెరుగుతుంది. శ్రమవుత్పాదకతలో ప్రణాళికాబద్ధ పెరుగుదలననుసరించి నెలసరిప్రతిఫలం సగటున 180 రూబుళ్ళకు పెరుగుతుంది. వ్యవసాయదారులకు తమ వ్యక్తిగతఖండ్రికల నుండీవచ్చే ఆదాయాన్నికూడా లెక్కలోకితీసుకుంటే వారి వాస్తవాదాయాలు ఆచరణలో ఫ్యాక్టరీ, ఆఫీసు కార్మికులస్థాయినందుకుంటాయి. యితోధికంగా శ్రమయాంత్రీకరణా, గ్రామసీమలో ప్రాధాన్యతాప్రాతిపదికపై యిళ్ళ, సాంస్కృతిక, సాముదాయక సదుపాయాలనిర్మాణం పెరుగుదలతోపాటు యిది గ్రామానికీ, పట్టణానికీమధ్య గణనీయమైనవ్యత్యాసాలను అధిగమించేదిశలో (సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమలక్ష్యాల్లో యిదొకటి) ఒకముఖ్యమైన ముందడుగు అవుతుంది.

పనినిబట్టి పంపిణీఅనే సూత్రాన్ని పటిష్టంచేసేందుకు అనువుగా, సోవియట్ ప్రజలజీవితంలో ప్రముఖపాత్రవహించే సామాజిక వినిమయనిధులను వికరంగాపెంచుతూ పోతాం. అవి యీ ఐదేళ్ళలో గణనీయంగాపెరిగి, 1990 లో జనాభాలో ప్రతిఒక్కరికీ 600 రూబుళ్ళవుతాయి.

తన సామాజికవిధానంలో పార్టీ యెల్లప్పుడూ వర్ధమానతరాన్ని పెంచి పెద్ద చేసేందుకై పరిస్థితులను మెరుగుపర్చేవిషయంలో ప్రత్యేకశ్రద్ధచూపుతోంది. పిల్లలున్న కుటుంబాలకు 12వ పంచవర్షప్రణాళికాకాలంలో ప్రభుత్వసహాయాన్ని మరింత విస్తరింప జేస్తారు. పనిచేసేతల్లులు తమ పిల్లలకు యేడాదివయసువచ్చేదాకా వారి ఆలనాపాలనా చూసేందుకుకోసం జీతంపై సెలవులనుయిచ్చే సౌకర్యాన్ని కొన్నేళ్ళక్రితం ప్రవేశపెట్టాం. యిది సామాజికంగా, జనాభారీత్యా చాలామంచి ఫలితమిచ్చింది. యీ విషయాన్ని ముసాయిదా మార్గదర్శకసూత్రాలపై చర్చసందర్భంలో వ్యక్తమయినపౌరుల కోర్కెలను దృష్టిలోవుంచుకుని, యీ సెలవును మరో ఆరునెలలకు పొడిగించడం వాంఛనీయమని గుర్తించాం. జబ్బుపడ్డపిల్లల ఆలనపాలననుచూసేందుకై తల్లికి సెలవును, జీతంపై

విరామకాలాన్నికూడా పొడిగించదలచాం. మూడేళ్లవచ్చేవరకూ పిల్లలకు వుచితంగా మందులను సరఫరాచేసేపద్ధతిని ప్రవేశపెడతాం.

పాఠశాలాత్పూర్వసంస్థలకున్న డిమాండ్‌ను పూర్తిగానెరవేర్చే అతిముఖ్య సమస్యను వచ్చే కొద్ది సంవత్సరాల్లో పరిష్కరించడం ఒక ప్రధానమైన సామాజిక-ఆర్థిక ధ్యేయం. యీ ధ్యేయం పూర్తిగా ఆచరణీయమైనది. యీ సమస్యపట్ల తగిన శ్రద్ధ చూపిన ప్రతిచోటా యిది జయప్రదంగా పరిష్కారమౌతోంది. శిశువిహారాల, శిశుసంరక్షణాలయాల నిర్మాణసమస్యను మంత్రిత్వశాఖల, డిపార్టుమెంట్ల అధిపతులు, స్థానికసంస్థలు తమ నిరంతర పర్యవేక్షణలోవుంచుకోవాలి.

పింఛన్లపథకాన్ని మెరుగుపర్చేందుకు, యుద్ధ, శ్రామికరంగాలవయోవృద్ధులకు, నేలకొరిగిన సైనికుల కుటుంబాలకు సమాజసంరక్షణను పెంచేందుకు భారీమొత్తాలు కేటాయించడం జరుగుతుంది. వృద్ధుల హాస్టళ్ళసంఖ్యను గణనీయంగా పెంచాలనీ, వాటి పనిని మెరుగుపర్చాలనీ తలపెట్టాం. అశక్తులైన పౌరులకు సేవాసదుపాయాల వుత్కృష్ట రూపాలను మరింత విస్తృతంగా ప్రవేశపెడతాం.

12వ పంచవర్ష ప్రణాళికాకాలంలో ప్రణాళికాబద్ధంగా వేతనాల, జీతాలపెంపుదల, సామాజికవినిమయనిధులవిస్తరణ అనేవి సమాజంలో విస్తృతభాగాల జీవనపరిస్థితులలో, జీవనప్రమాణంలో ప్రస్ఫుటమైన మార్పులను తెస్తాయి. దేశవ్యాప్తంగా వేతనాలూ, జీతాలూపెరగడంవల్ల, పింఛన్లూ, అలవెన్సులూపెంచడంవల్ల దేశజనాభాలో సగంమందికి పైగా ఆదాయం పెరుగుతుంది. గత ఐదేళ్ళలో ఆదాయం పెరిగినవారిసంఖ్యకు యిది రెండింతలు యెక్కువ. ప్రస్తుత పంచవర్ష ప్రణాళికాంతానికి మొత్తం కుటుంబాల్లో 50 శాతానికిపైగా నెలకు 125 రూబుళ్ళకుమించిన సగటు తలసరి ఆదాయంవుంటుంది. నెలకు 50 రూబుళ్లు, అంతకు తక్కువ తలసరి ఆదాయంగల కుటుంబాలు దాదాపువుండవు.

12వ పంచవర్ష ప్రణాళికాకాలంలో సామాజిక-సాంస్కృతికరంగంలో పాదార్థిక, సాంకేతికసదుపాయాలను నికరంగా విస్తృతపర్చేందుకు ప్రత్యేక ప్రాముఖ్యంవుంటుంది. పాఠశాలసంస్కరణలక్ష్యాలసాధనవల్ల సీట్లసంఖ్య 40 శాతం పెరుగుతుంది. బోధన, అధ్యాపనపరిస్థితులు మెరుగౌతాయి. ప్రత్యేక సెకెండరీ, వున్నతవిద్య పునర్వ్యవస్థీకరణను కూడా తలపెట్టాం. శిక్షణనాణ్యాన్ని సర్వతోముఖంగా మెరుగుపర్చడం, వున్నతవిద్యా సంస్థలకూ, వుత్పత్తికీ మధ్య మరింత సన్నిహితసంబంధాలునెలకొల్పడం, శాస్త్ర, సాంకేతిక అభివృద్ధిలో మరింత క్రియాశీలంగా పాల్గొనేట్టుచూడడం యీపునర్వ్యవస్థీకరణ

లక్ష్యంగా వుండాలి. యిందుకు వున్నతవిద్యకుగల పాదార్థికపునాదిని మరింత విస్తృత పర్చడంకూడా అవసరం.

ఆరోగ్యసంస్థలపనిని సమర్థతతో మెరుగుపర్చడం, వ్యాధిని నిరోధించేవిషయంలో వాటిలక్ష్యాన్ని విస్తరింపచేయడం, యావత్తు జనాభాకు కొన్నాళ్ళకొకసారి వైద్యపరీక్షలను చేసేపరిస్థితికి క్రమేణా మారడం—వీటికోసం యెంతో కృషిచేయాల్సివుంది. ఔట్ పేషెంట్ క్లినిక్కులనిర్మాణాన్ని, వైద్యసాధనాల, పరికరాలవుత్పత్తిని దాదాపు 50 శాతం పెంచాల్సివుంది. ప్రణాళికాబద్ధమైన పరిసరాల పరిరక్షణచర్యలుకూడా ప్రజల ఆరోగ్యానికి చాలా ముఖ్యం.

సాంస్కృతిక, క్రీడాసదుపాయాలను భారీస్థాయిలో నిర్మించాలని తలపెట్టాం. వుదాహరణకు, యీ ఐదేళ్ళలో మనం 500 ప్రాంతీయసాంస్కృతిక మందిరాలను, 5,500 కుపైగా గ్రామీణ క్లబ్బులను నిర్మించాల్సివుంది. ఫలితంగా ప్రతిప్రాంతీయ కేంద్రంలో ఒక సాంస్కృతికమందిరం వుంటుంది.

ఒక్కముక్కలో చెప్పాలంటే 12వ పంచవర్ష ప్రణాళికాకాలంలో సామాజిక-సాంస్కృతికరంగాన్ని గుణాత్మకంగా ఒక కొత్త స్థాయికిపెంచాలనే పార్టీ ధ్యేయాన్ని అందుకోవడంలో ఒక ముఖ్యమైన ముందడుగువేయ దలిచాం.

దీన్ని మనం నెరవేర్చాలంటే సామాజిక-సాంస్కృతికసంస్థలనిర్మాణం ప్రధాన విషయంకాదని ప్రణాళికాసంఘాలలోనివారితోసహా కొంతమంది కార్యనిర్వాహకుల్లో పాదుకునివున్న దృక్పథానికి మనం స్వస్తిచెప్పించాలి. సామాజిక-సాంస్కృతికరంగంలోని కొన్ని శాఖల అభివృద్ధికి 1986వ సంవత్సరంలోచేసిన కేటాయింపులు యీ ఐదేళ్ల నగటు వార్షికమొత్తానికన్నా తక్కువగావున్నాయని మనం అంగీకరించాలి. పంచవర్ష ప్రణాళికకు తుదిరూపమిచ్చేటప్పుడు దీన్ని సరిదిద్దాలి.

యీ లక్ష్యాలకై కేటాయించిన నిధులను సర్వత్రా, పూర్తిగా, ఫలప్రదంగా వినియోగించుకోవాలని వేరేచెప్పనవసరంలేదు. యీ నిధులను సేకరించడం సులభంకాదు. వాటి విషయంలో మనం జాగ్రత్తగా వ్యవహరించాలి. బైలోరష్యా, లిథుయేనియా, రష్యన్ ఫెడరేషన్లలోని అనేక మండలాలు వ్యవహారాలను యెంతబాగా నిర్వహించాయంటే అవి పౌరవిద్య, ఆరోగ్యసంస్థలను పనిలోపెట్టే ప్రణాళికలను నెరవేర్చటమేగాక వాటిలక్ష్యాలనుకూడా మించిపోయాయి. కాగా, కొన్ని రిపబ్లిక్కులు, నగరాలు సామాజిక-

సాంస్కృతికసంస్థలనిర్మాణప్రణాళికలను పూర్తిచేయడంలో ప్రతియేడాదీ విఫల మౌతున్నాయి. దీనికి సంబంధించి రెండు నిర్దిష్టవుదాహరణలు యిస్తాను. అష్కాబాద్ లో క్లినికల్ ఆస్పత్రిలోని రెండవభాగం 9 సంవత్సరాలుగా నిర్మాణమౌతూనేవుంది. యీ పనికి నిర్ణయించిన మామూలు వ్యవధి మూడున్నర యేళ్లమాత్రమే అయినా యిది 1989 లోపూర్తి అవుతుందని అంటున్నారు. క్రాస్నయార్స్క ప్రాంతీయ ఆస్పత్రిలో ఒకకొత్త విభాగం నిర్మాణం సహించరావంత మందగతితో జరుగుతోంది. అఖిల యూనియన్ కమ్యూనిస్టు సుబ్బోత్నిక్కుల ఆదాయాన్నికూడా యీ ప్రాజెక్టుకు ఖర్చు చేస్తున్నారు కాబట్టి యిలా జరగడం మరింత ఘోరమైనవిషయం. జార్జియా, ఉజ్బెక్ రిపబ్లిక్కుల్లో, హబారవ్స్క ప్రాంతంలో, పేర్మ, మరికొన్ని మండలాల్లో యిలాంటి వుదంతాలున్నాయని తెలుస్తోంది.

గృహనిర్మాణం పార్టీ నిరంతరం శ్రద్ధవహిస్తున్నసమస్య. యీవిషయంలో సాధించినఫలితాలు గణనీయమైనవి. యీనాడు పట్టణప్రాంతాల్లోనివసించే 80 శాతానికి పైగా కుటుంబాలకు విడివిడి యింటివాటాలున్నాయి. ఆధునిక గృహవసతివిషయంలో పల్లెప్రజలపరిస్థితికూడా మునుపటికన్నా చాలా మెరుగు. అయినప్పటికీ, గృహవసతి సమస్య యిప్పటికీ అతితీవ్రమైన సామాజికసమస్యల్లో ఒకటి. వచ్చేఐదేళ్ళలో మొత్తం 565_570 మిలియన్ల చదరపుమీటర్ల నివాసవసతిగల కొత్తయిళ్ళను నిర్మించాలని తలపెట్టాం.పట్టణాలను, గ్రామాలను మెరుగుపర్చేందుకూ, సదుపాయాలను, సేవలను పౌరరవాణాసౌకర్యాలను పెంచేందుకూ గణనీయమైన వనరులను కేటాయించాం.

ఈ గృహవసతిసమస్య తీవ్రంగావున్నకారణంగా శక్తియుక్తులను, నిధులను పెద్దయెత్తున సమీకరించాల్సిన అవసరముంది. అత్యధికసంఖ్యాక స్థానికసంస్థలు, మంత్రిత్వశాఖలు, డిపార్ట్మెంట్లు అదేచేస్తున్నాయి. కానీ, మరొకరకమైన వుదాహరణలు కూడావున్నాయి. వుదాహరణకు, ఆర్మీనియా రిపబ్లిక్కులో గృహవసతి ఆవశ్యకత యెంతో వున్నప్పటికీ గృహనిర్మాణంలో యేటా లక్ష్యాన్ని అందుకోడంలేదు. అంతేకాదు. కొన్ని నగరాల్లో సీటిసరఫరా తగినంతలేదు. అదేసమయంలో గృహనిర్మాణ కాంట్రాక్టు సంస్థలను ప్రణాళికలోలేని ప్రాజెక్టులకు మళ్ళించడం రివాజైంది. యిది సహించరానిది. 1985 లో ఆర్మీనియా పారిశ్రామిక నిర్మాణ మంత్రిత్వశాఖ ప్రణాళికలోలేని 12 ప్రాజెక్టుల పనిలో నిమగ్నమైంది. ప్రత్యేకప్రాముఖ్యంలేని ప్రాజెక్టులుకూడా వీటిలో వున్నాయి.

యిలాంటి పనులు యితరమండలాల్లోకూడా కొనసాగుతున్నాయని చెప్పడానికి నాకు విచారంగావుంది. వీటిని మొగ్గలోనే తుంచివేయాలి.

ప్రజల పెరుగుతున్న సార్థకగిరాకీని సాధ్యమైనంత పూర్తిగాతీర్చడం పార్టీ సామాజికవిధానంలో అన్నిటికన్నా యెక్కువప్రాధాన్యం వహిస్తోంది. యీనాడు యిది అతిముఖ్యమైన, కాలానుగుణ్యమైన సమస్యల్లో ఒకటిఅనిచెప్పడం అతిశయోక్తికాదు. శ్రమకుయిచ్చే పాదార్థిక ప్రోత్సాహకాలను పటిష్ఠంచేయడం, విరామసమయాన్ని హేతుబద్ధంగావినియోగించడం, సోవియట్ప్రజల మానసికస్థితి, వస్తువుల, తదితరాల కొరతవల్లకలిగే ప్రతికూలపరిణామాలను తొలగించడం—యివన్నీ పైసమస్యతో ప్రత్యక్షంగా ముడిపడివున్నాయి.

ఆహారపదార్థాల సరఫరాలను ప్రత్యేకించి మాంసం, పాడిపరిశ్రమ వుత్పత్తుల, కూరగాయల, పళ్ళసరఫరాలను పెంచేలక్ష్యం ప్రథమస్థానంలోవుంది. నిజంగా అదే సోవియట్ యూనియన్ ఆహారకార్యక్రమలక్ష్యం. యీకార్యక్రమం 1990 కి నిర్ణయించిన వుత్పత్తిలక్ష్యాలను సాధించడంవల్ల దేశప్రజల తిండితీర్థాల స్వరూపంలో, నాణ్యంలో విస్తృతప్రభావంగల మార్పులను—అంటే గత కొద్దిపంచవర్షప్రణాళికలకాలంలోకెల్లా పెద్దమార్పులను తీసుకురావడానికి వీలుకలుగుతుంది.

పారిశ్రామికసరకుల వాడకంలోకూడా ప్రగతిశీల మార్పులను సాధించాలి. యీ సరకుల సరఫరా యిటీవలి సంవత్సరాల్లో స్పష్టంగాపెరిగింది: అనేకవస్తువులతో మార్కెట్ యిప్పటికే నిండిపోయింది. యిప్పుడు మరో క్లిష్టసమస్య—నాణ్యం, వైవిధ్య సమస్య—ముందుకువస్తోంది. వినిమయసరకుల వుత్పత్తిఅభివృద్ధికి, సేవాసదుపాయాల రంగం అభివృద్ధికి సంబంధించిన సమగ్రకార్యక్రమం సరకులవుత్పత్తి స్వరూపం అనుసరించాల్సిన ధోరణులను నిర్ణయిస్తోంది. యీ సమస్యను పరిష్కరించడంలో వ్యాపారానికి క్రియాశీలపాత్రనివ్వాలి. సరకులకొరతను తొలగించటంలో సోవియట్ యూనియన్ వాణిజ్యమంత్రిత్వశాఖ, సహకారసంస్థల కేంద్రసమాఖ్య మరీ మందకొడిగా పనిచేస్తున్నాయి: నాసిరకంవస్తువులను తయారుచేసే కర్మాగారాదిసంస్థలపట్ల అవి నియమరహితమైన, విర్లిప్తవైఖరిని అవలంబిస్తున్నాయి; సరకులనిల్వల విషయంలో మరీ నిదానంగా వ్యవహరిస్తున్నాయి; వినిమయదార్ల డిమాండును తగినశ్రద్ధతో అవి పరిశీలించడంలేదు. వ్యాపారం, సేవలప్రమాణం యిప్పటికీ సహించరానంత తక్కువగా

వుంది. ప్రజలు మోజుపడేనరకుల వైవిధ్యాన్ని విస్తరించడానికి సంబంధించిన సమస్యలను పరిశీలించేటప్పుడు మనం ఖరీదైనవికాకపోయినా నాణ్యమైనసరకుల వుత్పత్తిని, ముఖ్యంగా పిల్లలు, వృద్ధులు వాడేటటువంటి సరకులను అకారణంగా తగ్గించరాదని వేరే చెప్పాల్సిన అవసరంలేదు.

మద్యపానవ్యసనానికి, తాగుడుకు వ్యతిరేకంగా పార్టీ తీవ్రమైనదాడి ప్రారంభించిన యీవాడు సార్థకగిరాకీని తీర్చేకర్తవ్యానికి ప్రత్యేక ప్రాముఖ్యం వుందని నొక్కిచెప్పడం పూర్తిగాసరైనదే. మద్యంవుత్పత్తి, అమ్మకాలను బాగాతగ్గించేవిధానాన్ని భవిష్యత్తులోకూడా దృఢంగా వర్తింపజేస్తాం. యిది వస్తువినిమయ స్వరూపంలో మంచిమార్పువచ్చేందుకు తోడ్పడుతుంది; యీ విధానం పంచవర్ష ప్రణాళికలో, వార్షికప్రణాళికల్లో ప్రతిబింబిస్తుంది.

మొత్తంపై చిల్లరవ్యాపారాన్ని (మద్యం అమ్మకాలను మినహాయించి) యీ ఐదేళ్ళలో దాదాపు మూడోవంతుపెంచాలని తలపెట్టారు. డబ్బుచెల్లింపు ప్రాతిపదికపై సమకూర్చేసేవలను కొత్తపద్ధతిలో భారీస్థాయిలో శక్తివంతంగా అభివృద్ధిచేయాల్సివుంది. గత కొద్దిసంవత్సరాలుగా ప్రజల మొత్తంఖర్చుల్లో సేవాసదుపాయాలవాటా 10 శాతం మాత్రమేవుంది. యిది ప్రజల అవసరాలకన్నా చాలాతక్కువ; యిది వస్తువులకుగల గిరాకీ స్వరూపాన్నికూడా వికృతంచేస్తుంది. ఆ గిరాకీని సరకులపైపుమళ్ళిస్తుంది. నిత్యజీవితాని కంతటికీ అంటే వినోదం, పర్యటన, ప్రజలవిరామానికి పరివ్యాప్తమైన, బాగా అభివృద్ధి చెందిన అత్యధునాతన సేవలరంగాన్ని, క్లుప్తంగాచెప్పాలంటే ఒక నూతన ఆర్థికశాఖను స్వల్పకాలంలో స్థాపించాల్సివుంది. యీ ముఖ్యరంగంలో 12 వ పంచవర్షప్రణాళికా కాలంలోనే ఒక నిర్ణయాత్మకమైన మలుపును తీసుకరావాల్సివుంది. డబ్బుచెల్లించే ప్రాతిపదికపై సమకూర్చే సేవలపరిమాణం 30-40 శాతం పెరగాల్సివుంది.

ప్రత్యేక కర్మాగారాదులను, సంస్థలను శాఖోపశాఖలుగా విస్తరింపజేయడం యీ సేవల మెరుగుదలలో ప్రాధాన్యంవహిస్తుంది. కానీ, యిందుకు వ్యవధీ, నిధులూ అవసరం. యీపని త్వరగా ప్రారంభంకావడానికి అన్ని ఆర్థికశాఖల్లోని సంస్థలను అవి యేరకమైన కార్యకలాపాలు నిర్వహిస్తున్నాసరే ప్రజలకు సేవాసదుపాయాలను సమకూర్చాలని నిర్ణయించాం. కానీ, యీపని అన్నిచోట్లా యింతవరకూ తగువిధంగా ముందుకుసాగలేదు. యిందులో చురుగ్గాపాల్గొనడం స్థానికసంస్థలకు, ప్రజాప్రతినిధుల సోవియట్లకు విధాయకం.

కామ్రేడ్స్, 12 వ పంచవర్షప్రణాళికాకాలంలో సోవియట్ ప్రజలపని, జీవన పరిస్థితులను, జీవితవిధానాన్ని మెరుగుపర్చేందుకు, వారి సంక్షేమాన్ని పెంచేందుకు యివి అతిముఖ్యమైన కర్తవ్యాలు: యివి అమలులోకివచ్చినట్టయితే సోషలిస్టు జీవితవిధానం మరింత పటిష్టమౌతుందనేది నిస్సందేహం; ప్రజల పాదార్థికసంక్షేమం వారి ఆత్మిక కార్యకలాపాల అభివృద్ధితో, సృజనాత్మక కార్యకలాపాల అంగాంగికాభివృద్ధితో సమ్మిళిత మౌతుంది.

ప్రజాజీవనంలోని అన్నిఅంశాలనూ మెరుగుపర్చడానికి పార్టీ శ్రద్ధచూపుతూ ఆత్మికఅంశాన్ని, శాశ్వతమైన నైతికవిలువల, ఆదర్శాలప్రాముఖ్యాన్ని ఒక నూతనస్థాయికి పెంచుతోంది. కమ్యూనిజంనిర్మాతగా సోవియట్ పౌరుణ్ణి తీర్చిదిద్దడంపై యివి అధికాధిక ప్రభావం నెరపుతాయి.

కామ్రేడ్ ప్రతినిధులారా,

పార్టీ నిర్దేశించినట్టి మనం సాధించాల్సిన విజయాల ఔన్నత్యాన్ని, కేంద్రకమిటీ రాజకీయనివేదికలో, 27 వ మహాసభతాలూకు యితరపత్రాల్లో నిర్దేశించినకర్తవ్యాల ఔన్నత్యాన్ని యీ మహాసభ జరుగుతున్న ప్రతిఒక్కరోజూ అంతకంతకూ ప్రస్ఫుటంగా, మనసుకు హత్తుకునేట్టు చూపుతోంది. మహాసభ ప్రతిపాదించిన భావాలూ, సూత్రాలూ యీ ప్రత్యేకసమయంలో మార్క్సిజం-లెనినిజాన్ని సృజనాత్మకంగా వర్తింపచేసేందుకు ఆదర్శప్రాయంగావున్నాయి: ప్రగాఢమైన మార్పులకు, శక్తివంతమైన కార్యాచరణలకు మనకిదే ఆదను. వాటి పరివర్తక, నిర్మాణాత్మకశక్తి నిరంతరాయంగా పెరుగుతుందని, మన సమాజజీవితంలోని అన్ని అంశాలపై విప్లవాత్మకప్రభావం నెరపుతుందని నిశ్చయంగా చెప్పగలను.

తగుదృఢచిత్తంతో, శక్తితో, పట్టుదలతో మన ప్రణాళికలను అమలుజరపడమే యిప్పటి సమస్య. విస్తృతప్రజాబాహుళ్యాల నిర్మాణాత్మక సృజనశీలతపై, దేశవ్యాప్త సోషలిస్టు పోటీపై ఆధారపడడంద్వారా మన నిర్ణీతలక్ష్యాలను ఆచరణలో నెరవేర్చడంకోసం నడుంకట్టడమే యిప్పటి సమస్య. అవి మనప్రజల ముఖ్యప్రయోజనాలకు, వారి ఆశయాలకు, శాంతియుత ఆకాంక్షలకు అనుగుణమైన వుదాత్తలక్ష్యాలు.

వాటిని నెరవేర్చడమంటే మన మాతృభూమి పాటవ, సౌభాగ్యాలను మరింత పటిష్టంచేయడమన్నమాట.

వాటిని నెరవేర్చడమంటే సోవియట్ ప్రజల, ప్రతిసోవియట్ కుటుంబజీవితాన్ని యిప్పుడున్నదానికన్నా శ్రేష్టంగావుండేట్టు చేయడమన్నమాట.

వాటిని నెరవేర్చడమంటే సోషలిజం స్థానాలను, ప్రపంచశాంతిని పటిష్టంచేయడమన్నమాట: అణుమహోపద్రవంనుండీ మన భూమండలాన్ని రక్షించడమన్నమాట: శాంతిని కాపాడడమన్నమాట.

తమ లెనినిస్టుపార్టీ వెనుక సన్నిహితంగా సమీకృతులైన మనదేశ శ్రామికప్రజలు వుదాత్తబాధ్యతాభావంతో, కాలావసరాలను గుర్తెరిగి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 27వ మహాసభ చరిత్రాత్మక నిర్ణయాలను జయప్రదంగా అమలుజరిపేందుకు తమకు చేతనైనదంతాచేస్తారని నేను నమ్మకంగా చెప్పగలను.



67

**SOVIET SAMEEKSHA** (Telugu) Vol. 20, No. 10
March. 7, 1986

CONTENTS

63


**సోవియట్ సమీక్ష**

| | |
|---|---|
| సంపాదకుడు : | ఎల్. ఎ. అబ్రమోవ్ |
| మేనేజింగ్ సంపాదకుడు : | సెర్గీ బియాకోవ్ |
| సంయుక్త సంపాదకుడు : | జి. ఆళవందార్ |
| సహాయ సంపాదకుడు : | మునగాల జనార్దన రెడ్డి |
| కళాకారుడు : | ఎ. ఎం. డీయకొవ్ |




11 భారతీయ భాషల్లో
వెలువడే పత్రిక


Printed by Y. L. Frolov and Published by him at Soviet Nadu Office, 115, Theagaraya Road, Madras-600 017, for the Information Department of the USSR Embassy in India. Printed at Sri.Venkateswara Printers, Madras-600 021.

Statement about ownership and other particulars about Newspaper SOVIET SAMEEKSHA - (Telugu)

64

FORM IV

*( See Rule 8 )*

1. Place of Publication ... 115, Theagaraya Road, Madras-600 017.

2. Periodicity of its Publication ... Weekly

3. Printer's Name ... Y. L. FROLOV
   (Whether citizen of India ?) ... No.
   (If foreigner, State the country of origin) ... USSR
   Address ... 115, Theagaraya Road, Madras-600 017.

4. Publisher's Name ... Y. L. FROLOV
   (Whether citizen of India ?) ... No.
   (If foreigner, State the country of origin) ... USSR
   Address ... 115, Theagaraya Road, Madras-600 017.

5. Editor's Name ... L. A. ABRAMOV
   (Whether citizen of India ?) ... No.
   (If foreigner, State the country of origin) ... USSR
   Address ... 25, Barakhamba Road, New Delhi-110 001.

6. Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital. ... Information Department of the USSR Embassy in India, 25, Barakhamba Roa New Delhi-110 00

I, Y. L. FROLOV, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd.) Y. L. FROLOV
Signature of Publisher

Date : 3-3-1986

# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M155 |
| పుస్తకం పేరు | సోవియట్ సమీక్ష |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Sharshini |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | ozoo |